# రాజ్యాకాంక్ష

చారిత్రక ప్రకరణము

( 5 అంకములు )



గ్రంథకర్త :

శ్రీ అంకరాజు శంకరశాస్త్రి



ప్రకాశకులు

డాక్టరు గురుమూర్తి ఆశయ నిర్వాహక సంఘం

రాజమహేంద్రవరం.

## ★ అంకితము ★

సహృదయులు, దీనబాంధవులు, పూజనీయులు

నా కాప్తులు అయిన

డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారికి

హృ ద య పూ ర్వ క ము గా

# పరిచయము

శ్రీయుత అంకరాజు శంకరరావు నా కా బాల్యమిత్రుడు.

చిన్నప్పటి నుండియూ నాటకపాత్రధారణాసక్తుడగుటచే నాటకస్వరూపమును రంగస్థలానుభవమును చేజిక్కించికొని, కష్టార్జిత ధనము ననుభవింపక గుప్తపరచి వృథచేయు లుబ్ధుడట్లుగాక "రాజ్యకాంక్ష" మూలమున రసపిపాసుల యాకాంక్ష దీర్ప సరసుల ప్రోల సమర్పించినాడు.

దీనిని, టాడ్ విరచితమైన రాజస్థాన కథావళినుండి యతి సంక్షిప్తమగు నితివృత్తము నాధారముగ గైకొని, బుద్ధికుశలతచే నెన్నియో వన్నెచిన్నెలు కల్పించి ("Story is the Thing") కథయే ప్రధాన విషయమను షేక్స్పియరు మహాకవి వాక్కు ననుసరించి యతి రసవంతముగ జేయగల్గినాడు.

సహాకారోద్యమ మూలమున సంఘసేవ చేయుచున్నను, తన యన్నయగు శ్రీ రామారావు యొక్క యశశ్చంద్రిక లింకను తనకు వెల్గునొసగుచునే యుండుటచే నాటకముల విడనాడలేక కాబోలు నప్పుడప్పుడొక్కొక్క నాటకమును రచించుట కాతడు పూనుకొనుచుండును.

అట్లయ్యును, దీనియం దాతడెంతటి సిద్ధహస్తుడో దీని జదివిన దెల్లమగును. గురుతుల్యులగు శ్రీ గురుమూర్తి నిది యాకర్షించు టబ్బురముగాదు.

తన్నాశ్రయించిన వారి కేనాడు దయాళుడు తొంటచేతిజూపింపలేదు. అట్టియెడ శిష్యసంతానమును సౌభాగ్యవంతము జేయ నాలడియక్కొను చింతయూ నాతనికి తగినదే. కాని, దానిని పరిదర్శింపగా జూడవలె ననుకొనిన వారికోర్కె దీరకుండగనే వారు దివంగతులగుట శ్రీ శంకరరావున కల్లాపాతమే.

దురాశచే దుఃఖభాజనుడైన దౌర్భాగ్యుడు అజితసింహుడు. అతని రాజ్యకాంక్షయొక్క చరిత్రయే యీ నాటకము. దీనిని, జీవితమునం దాశ నేమాత్రమెరుగని శ్రీ గురుమూర్తి కంకితమొనర్చుటచే యశఃకాముడైన గురువును తద్భక్తుడగు శిష్యుడును గూడ ధన్యులు.

ద్రోణంరాజు చిన కామేశ్వరరావు.

# విజ్ఞప్తి

"రాజ్యకాంక్ష" యను ఈ నాటకమునకు మూలము రాజస్థానకథావళిలోని అమరసింహుని రాజ్యమును భక్తాసింగు అపహరించుట యనుగాథ. మిగిలిన యితివృత్త మంతయు స్వకల్పితము. ఈ కథావస్తువును నాటకరూపమున వ్రాయవలె ననెడి సంకల్పము చిరకాలము క్రిందటనె కలిగినను, నాటక రచనకు వలయు ప్రాపంచికానుభవమును గడించినగాని వ్రాయ సాహసింప విరమించితిని. ఒకనాడు ప్రసంగవశమున నా మిత్రులు కీ॥ శే॥ శ్రీ కోలవెన్ను అనంతకామేశ్వరరావు ఈ కథను నావలన విని ప్రదర్శనయోగ్యమైన నాటకమును రచింప నన్ను పురికొల్పెను. ఆతని ప్రోత్సాహమున 1943 నవంబరు నెలలో ప్రారంభించి తీరిక కల్గినపుడెల్ల వ్రాయుచు రెండుమాసములలో దీనిని ముగించితిని.

నాకు భాషాజ్ఞానము స్వల్పము. అయినను చారిత్రకగాథయగుటచే గ్రాంధికమున వ్రాయసాహసించితిని. దోషములు మెండుగ నుండవచ్చు. చదువరులు మన్నింతురుగాక ! ఇతివృత్తము, పాత్రపోషణము రంగవిభజనము, రసోత్పాదక సన్నివేశములు, నాటకరచనకు ప్రాధాన్యములనితోచి చిన్ననాటనుండి రంగస్థలముపై నాకుగల యనుభవమును పురస్కరించుకొని యీరచనకు పూనుకొంటిని. నాప్రయత్నము యెంతవరకు ఫలించినది చదువరులే నిర్ణయింప సమర్థులు.

ఈ రచన పూర్తియైన పిమ్మట నాకు పూజ్యులును, భాతృసమానులు నగు శ్రీ డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారికి దీని నంకితమిచ్చి నా ఋణము దీర్చుకొన సంకల్పించితిని. ది. 10-6-48 వ తేదీని

డాక్టరుగారి వసతిగృహమున పలువురు మిత్రుల సమక్షమున దీనిని వారి కంకిత మొనర్చితిని. దీనిని ప్రదర్శించి చూడవలెననెడి వారి యాశ ఫలించక పూర్వమే వారు దివికేగిరి.

డాక్టరుగారి యాశయ నిర్వాహకసంఘమువారు దీనిని దయతో నచ్చొత్తింప బూనుకొనినందులకు వారికి కృతజ్ఞుడను. ఆశయ నిర్వాహక సంఘకార్యదర్శియు, నా మిత్రులును అగు శ్రీ ఓగిరాల వెంకట సుబ్బారావుగారిని, ఈ గ్రంథ ప్రచురణలో చూపినశ్రద్ధకు, ప్రశంసింవక తీరదు. త్వరలోనే పై సంఘమువారు దీనిని ప్రదర్శించుటకు కూడ పూనుకొనియున్నారు. సహృదయులు నాకు తగు ప్రోత్సాహమిచ్చి క్రొత్తరచనలకు పురికొల్పుదురు గాత !

రా జ మ ం డ్రి,
5—7—1949.

అంకరాజు శంకరరావు,



# మనవి

ఈ "రాజ్యకాంక్ష" రూపకమును గ్రంథకర్త శ్రీ అంకిరాజు శంకరరావుగారు 10-6-48 తేదీన డాక్టరు పాలకోడేటి గురుమూర్తి గారికి డాక్టరుగారి భవనమున సమావేశమైన మిత్రమండలి యెదుట అంకితమొసగిరి. స్వీకరించినకృతి చెదపురుగులపొట్టలో జీర్ణించిపోకుండ, కృతి సార్థకమగునట్లు ప్రజలతో సారస్వతకాంక్ష ప్రబలునట్లు యితోధికప్రచారము తమకావ్యము వలన కూడ ప్రాప్తించవలెనని డాక్టరు గారు ఆశించిరి.

"రాజ్యకాంక్ష" కావ్యము దృశ్య ప్రబంధమగుటచే, తనజన్మమెంతవరకు సార్థకము చేసుకొనగలిగినదో దానిని ప్రదర్శింపజేసి చూడగోరిరి. ఈ మాత్రమైన చేసినగాని తాము కృతి స్వీకారము చేయుట వెకిలితనమని వారు ఘట్టిగా నమ్మియుండిరి.

అప్పటిలో యీ కావ్యప్రచురణ, ప్రదర్శనములకు అవకాశమిచ్చినదికాదు. విధి తలవని తలంపుగా వారిని పరలోకమున జేర్చినది.

ఇంతకాలము శ్రీ గురుమూర్తిగారు తమ ధన, ప్రాణములను, జవసత్వములను ఏ ప్రజకంకితమొనర్చిరో ఆ ప్రజ వారియుద్దేశములను కొంతవరకైనను నెరవేర్ప సంకల్పింపక పోవుట కృతఘ్నతయే కాగలదని యెంచి, చివర రోజులలో వారు తరచు వ్యక్తీకరించిన యీ యుద్దేశమును నిర్వహించుటకు మేము పూనుకొని యీ గ్రంథ ముద్రణకు గడంగితిమి.

ప్రకాశకులు.

# ఇందు వచ్చు ముఖ్యపాత్రలు

| | | |
|---|---|---|
| అమరసింహుడు | ......... | యోధపురాధీశ్వరుడు |
| భుక్తాసింగు | ......... | అమరసింహుని పినతండ్రి |
| జనార్దనశర్మ | ......... | యోధపురమహామంత్రి |
| విశ్వావసువు | ......... | సహాయమంత్రి |
| బలవంతసింహుడు | ......... | కల్యాణదుర్గాధ్యక్షుడు |
| అజితసింహుడు | ......... | బలవంతుని తమ్ముని కొడుకు |
| రూపసింహుడు | ......... | అజితుని సోదరుడు |
| గోపాలవర్మ | ......... | కల్యాణదుర్గములోని సర్దారు. |
| వీరసింహుడు | ......... | భుక్తాసేనాని |
| బలదేవుడు | ......... | భిల్లరాజు |
| వీరమల్లు<br>రాయగండడు<br>జగజెట్టి<br>గడానాయకుడు | } | భిల్లులు |
| అలీఖాన్ | ......... | అజితుని బానిస |
| నందుడు | ......... | జనార్దనుని అనుచరుడు |

ఇంకను, కృషీవలులు వత్తురు.

స్త్రీలు.

| | | |
|---|---|---|
| ముక్తాబాయి | ......... | బలవంతుని యిల్లాలు |
| కమల | ......... | ముక్తాబాయిసఖి |
| మోతి | ......... | భుక్తా యుంపుడుకత్తె |





ఓం.

# రాజ్యాకాంక్ష.



## ప్రథమాంకము



### రంగము 1.

స్థలము:- యోధపుర పరిసర ప్రాంతము.

కాలము:- సంధ్యాసమయము.

[ ప్రవేశము - సన్యాసి వేషమూని, జనార్దనశర్మ ]

జనా:- ఓ! యోధపుర సామ్రాజ్యలక్ష్మీ! జోహారు. చతురబ్ధి వేలావలయిత భూమండలమున కలంకారమగు భారతమాతృగళసీమ వెలుఁగొందు రసపుత్రతారహారంబున మణిపూసవై, అసమాన శౌర్యధనుల, యోధాగ్రేసరులఁగని, యోధపురమను నీనామంబును సార్థకం బొనరించుకొంటివి. పవిత్ర లూనానదీ తోయంబులచే పరిపూరితమై, అభేద్యంబులగు గిరిదుర్గంబులచేతను, దుర్గమకాంతారంబుల చేతను, సహజంబగు, నీప్రకృతి రామణీయకతనుఁ, దిలకించుకొన్న కొలఁదియు, నా మేను పులకాంకురం బగుచున్నయది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

ఇట్టి నా జన్మభూమిని విధివశంబున వీడవలసె. తిరిగి భవదీయ చరణసేవ యొనర్చు మహాద్భాగ్య మెన్నటికి కల్గునో కదా!

(తెరలో కోలాహలము - భేరీనినాదము)

ఏమిది? ఏమి యీకోలాహలము? ఓహో! భక్తాసింగు నగర ప్రవేశ విజయధ్వానములు కాబోలు! హాతవిధీ! ఎంతలో నెట్టి మార్పు! సకల సద్గుణ సంపన్నుండును, ప్రజాక్షేమాభిలాషియు, ధర్మాచరణుండును, తరుణుండునగు నమరసింహుడేడ! కుత్సిత స్వభావుండును, క్రూరాచారుండును, కుతంత్ర ప్రవీణుండును, ధనపిశాచావేశా పరుండునగు భక్తాసింగేడ! సోదరపుత్రుండని యైనను భావింపక, మహామోహాంధుండై, నమరసింహుని రాజ్యాపహరణంబునకు బూనుకొనిన, యీ దుష్టాత్మునకు ప్రత్యుద్ధానమా!

(తెరలో కలకలము - జనఘోష)

అరువుడు. మీగొంతులు బ్రద్దలగునట్లరువుడు. వత్సరంబైనను కాలేదే. అమరసింహుని పట్టాభిషేకోత్సవము నతివైభవముగ జరిపి! నాటి యలంకారములైనను మాయలేదే! ఇంతలో నేయిట్టి మార్పు! (తిరిగి జయజయ ధ్వానములు) ఈప్రజాసమూహమున కెంతటి మైమరపు! ఎట్టెదోగిర మెవ్వరిడిన వారివెంట తోకాడించుచు పరువిడు, యూరకుక్కలబోలు నీమూకకింగిత జ్ఞానమేదీ! అమరులకైనను నలంకారప్రాయుండగు నమరసింహునియెడ నత్యాచారమొనర్చిన యీ రాక్షసున కాహ్వానమా! భరింపజాల! భరింపజాల! (కన్నులమూసికొని మోకరించి) హే! భవానీ! భక్తజనప్రదాయనీ! ముక్తిదాయనీ! నీదివ్య

నీ మోహన విగ్రహమును, నీ సుహాసిత వదనారవిందమును, నీ మంజుల వాగ్విలాసంబులును, నీ భక్తజన హ్లాదయు రంజకంబులగు కరుణార్ద్ర వీక్షణంబులను, నిరంతర మారుగు పరచుము. భీకరకరాళ దంష్ట్రా విరాజితవై, క్రోధఘూర్ణిత నేత్రవై, ప్రళయకాల మహోచండవై, మహిషాసుర మర్దనివై, నాకు దర్శనమొసంగుము. నా శత్రుసంహార కర్తవ్యంబునకు దోడ్పడుము. నాలో ప్రతీకారవాంఛను పురికొల్పుము, ప్రతిహింసాగ్నిని రగుల్కొల్పుము. నాలో నావేశింపుము. హే! జగదేకమాతా! లోకైకపూతా! భవ్యచరిత్రా! పాహిమాం! పాహిమాం!

ఇదే భవానీపాదపద్మములసాక్షిగా, నమకసింహుని రాజ్యప్రతిష్టితుని జేసినగాని యోధపురమును తిరిగి ప్రవేశింపను. ఆ! అదేమి ఆ వచ్చువారెవరు? చారుడై యుండునా? లేక...(అని చాటున కేగి పరిశీలించి) నానుచరుడు నందుడై యుండునా?

(నందుడు - ప్రవేశము ఆటవికుని వేసమున)

నందు:- నా యేలిక, యిందే యుండునని చెప్పియుండెగదా! చీకటులాక్రమించినవి-వచ్చియే యుండవలె.

జనా:- (పోల్చుకొని) నందా!

నందు:- స్వామీ!

జనా:- నీవేనా? (బయటికివచ్చి) వెంటనే పోల్చుకొనలేకపోతిని. నావేసమెట్లున్నది?

నందు:- ఎట్లున్నదని యడుగవలెనా ? అద్దమున్నచో మిమ్ము మీరే గుర్తింపలేరని తలంచెద. మీ కంఠస్వరమునుబట్టిగాని, లేకున్న యిప్పటికిని మిమ్ము నేను గుర్తింపజాల.

జనా:- చీకటి పడుటచే గుర్తింపలేకుంటివేమో! విశ్వావసునకు నా సందేశ మందించితివా ? ఆతడేమనెను ?

నందు:- దురాత్ముడగు భుక్తాసింగును సేవింపవలసి వచ్చినందులకు మిగుల చింతించెను. కాని, మీయాజ్ఞ జవదాటనేరక యెట్ట కేలకు మీరు చెప్పినప్రకారము. తు-చ-తప్పకుండ సంచరింతు ననియెను. శక్తివంచనలేక, శతృవంచనకు పూనుకొనియెద ననెను.

జనా:- భుక్తాసింగున కనుమానము కలుగకుండ ప్రవర్తింప వలెనని నుడివితివా ?

నందు:- మహామంత్రులు, విశ్వావసుగారి సామర్ధ్యమును శంకించు చున్నారా ? సర్వవిధముల భుక్తాసింగు విశ్వాసపాత్రునివలె సంచరించి, శతృమారణోపాయంబుల నెప్పటి కప్పుడు తమకు, తెలియబరచెద ననిరి.

జనా:- మంచిది. విశ్వావసువసాధ్యుడు. చెప్పినంత పట్టు చేయుగలడు. ఇంతకు, మహారాజు అమరసింహుని వార్తయేమి ? రాజ కుటుంబము సంగతేమి ?

నందు:- అమరసింహ మహారాజులవారు, చీకటి పడకమునుపే గమ్య స్థానమును, సురక్షితముగా చేరినట్లు వార్తవచ్చినదట. ఇక రాజ కుటుంబము నిర్ణీతప్రదేశమున సుఖులై యుండిరని చెప్పిరి.

జనా:- నందా! ఇంతవరకును, మన యత్నము ఫలించినది. భవాని కృపవలన ముందుకూడ యట్లే యగుగాక! తల్లీ! జోధపుర లక్ష్మీ! నీకిదే వందనము. తిరిగి యెప్పటికో యీ జనార్దనునకు నీపునర్దర్శనము. నందా! రమ్ము. నీవు నాయెదనడ సంచరింప వలయు.

(నిష్క్రమింతురు)

## ర ం గ ము 2.

స్థలము:- యోధపురరాజమందిరము.

కాలము - ఉదయము

(ప్రవేశము - విశ్వావసువు - భుక్తాసేనాని - వీరసింహుడు పరిజనులు)

వీర:- అమరసింహుడు పలాయనుడైనట్లేనా? జనార్దనశర్మజాడ తెలియ లేదా ?

విశ్వా:- భీరువు. క్షత్రియజనయోగ్యముకాని పనియాచరించె. మరణ మొండె; జయ మొండె. యుద్ధరంగమునుండి పలాయితుడగుట రసపుత్రవంశమున కపకీర్తి. జనార్దనశర్మ యే యుపాయము నెటింగించి యుండవలె.

వీర:- అమరసింహ పక్షపాతులందరును బంధింపబడినట్లేనా ? శత్రు శేషము ఋణశేషము నుంచుకొనరాదు.

విశ్వా:- నిస్సంశయముగా బంధింపబడిరి. బంధితులుకాని వారు నగర మును వీడిరి. సుక్షత్రియులు రణరంగముననిహతులైరి. యోధ పురరాజ్యలలామ భుక్తాసింగు హస్తగత మైనది.

(ప్రవేశము భుక్తాసింగు సపరివారముగ)

పరివారము:- జయ జయ రాజమార్తాండ చండప్రచండ శ్రీ శ్రీ శ్రీ భుక్తాసింగు మహారాజాబహద్దురు వారికి జై.

విశ్వా:- మహారాజులవారికి స్వాగతము. యోధపురరాజ్యలక్ష్మి నేటికి సనాథయైనది. భుక్తాసింగు మహారాజులవారి పరిపాలనా సౌఖ్య వంబున కెడయై యల్లాడిన, పీడితజనుల వాంఛితార్థము నేటికి సమకూడినది. విద్రోహుల కుతంత్రములు నిర్మూలింపబడినవి. రాజ్యమున శాంతిస్థాపన కేలినవారి కీభృత్యుడు సర్వవిధముల తోడ్పడ సంసిద్ధుడు.

భుక్తా:- విశ్వావసూ! వీరసింహుని వలన నీ రాజసేవా పరాయణత నెరింగి మిగుల సంతసించితిమి. విద్రోహుల బంధించుటయందు, నీవొసంగిన సహాయ్యము సామాన్యమని యెంచితిని. కాని—అమర సింహ జనార్దను లిరువురును చిక్కకుండుట శోచనీయము. అందులకు గట్టిప్రయత్న మొనర్పలేదేమో ?

వీర:- రాత్రి యంతయు విశ్వావసు మంత్రిసత్తముని తోడ నుండి వారి సాంకేతిక ప్రదేశములన్నింటిని గాలించి. కాని వారంతకుమున్దే రహస్యమార్గమున నగరు వీడియుండవలె. వారి జాడల నరయుటకును, నగరమార్గముల శోధించుటకును, యుద్ధ భటుల నియమించితిమి. చారుల నలుగడల బంపితిమి. కాని యింతవరకును వారి జాడ తెలియలేదు.

భుక్తా:- అమరసింహుడు జనార్దనశర్మ తంత్రములకులోనై యిట్టిపని గావించియుండును. శైశవంబుననుండియు తనకు రక్షకుడనై, తనశ్రేయస్సునే కోరియున్న నాపై దుష్టనేరారోపణ గావించి, నన్ను రాష్ట్రమునుండి వెడల నడపెను. అందులకు ప్రతిఫలము నేడనుభవించెను.

వీర:- దేవరవారి యుదారతయే వాని నింతవరకు దెచ్చినయది— లేకున్న—

భుక్తా:- లేకున్న, మొదటనే రాజ్యస్వీకరణమును నేను సంకల్పించిన, అమరసింహుని పేరెత్తువారైనను, లేకుండెడివారు. ఇప్పుడైనను మనము ప్రమత్తులమై యుండరాదు. ప్రజలందరకు నాయాజ్ఞను వెల్లడింపుము.

వీర:- చిత్తము. దేవరవారు సెలవీయ వేడెద.

భుక్తా:- రాజద్రోహులైన, జనార్దన, అమరసింహులజాడలు దెలిపిన వారికి గాని, వారిని పట్టియిచ్చిన వారికిగాని, పదివేల వరహాలు

పారితోషిక మిచ్చెదనని దెల్పుము. విద్రోహుల వధమైనా, రాజద్రోహమునకు సంకల్పించువారికి మరణమే శిక్ష. నగరము నుండి వెలుపలికిగాని, వెలుపలినుండి నగరములోనికిగాని పో ని చ్ఛగించువారు ముందుగ రాజానుమతిపత్రముల పొందవలెను. ప్రజలెల్లరును భుక్తాసింగునే రాజుగా నంగీకరింపవలెను. ఇందు లకు భిన్నముగా ప్రవర్తించువారు క్రూరశిక్షలకుపాత్రులయ్యె దరు. చీకటిపడినది మొదలు సూర్యోదయము వరకును, ప్రజ లెవ్వరును, తమ తమ గృహములవీడి రారాదు. అనుజ్ఞాపత్ర ములు వీరసింహునివద్దనుండి పొందవలెను,విశ్వావసూ! రాజాజ్ఞా పాలనయందు, అప్రమత్తుండవై చరియింపవలెను. వీరసింహా! దండనార్హుల దండించుటయందును, శాంతిస్థాపనయందును, నీకు పరిపూర్ణమైన హక్కుల నిచ్చితిమి.

వీర:- దేవరవారి భృత్యునియందు చూపిన నమ్మకమునకు కృతజ్ఞు డను. నేనిదే సైనికుల హెచ్చరించి, సర్వమును నడుపించెదను. రాజ్యపాలనయందు, సైనికనిర్వహణ బాధ్యతనెరింగిన యేలిన వారి బుద్ధికుశలత యెంతయు ప్రశంసనీయము. డోలాందోళితు లగు ప్రజాసమూహమును, కత్తిచూపియే పరిపాలింపవలెను. మెత్తదనము నసమర్థత్వముక్రింద భావించి చెలరేగెదరు.

భుక్తా:- బాగు! వీరసింహా! బాగు! భుక్తాసింగు మన స్తత్వమును నీవు బాగుగ గ్రహించితివి. మొట్టెడువారికి జడియునట్లు మొక్కెడి వారికి జడియరు. ఈ రాజనీతి నవలంబింపక పోవుటచేతనే, అమరసింహుడు నన్ను ప్రవాసమున కంపగలిగె. కావున, నేడీ కఠినరాజనీతి బ్రయోగింపవలసె. అన్నను—మరచితి—రాజో ద్యోగులలోడను, పరిజనులతోడను, రాజభక్తి ప్రమాణముల తీసికొనవలెననియు, సంశయాత్ముల క్షమింపననియు దెలుపుడు. భుక్తాసింగునకు క్షమయనునది లేదు. తెలియునా ?

విశ్వా:- చిత్తము. ఏలినవారు సెలవిచ్చినరీతి సర్వమును నిర్వహింప గలవారము.

భుక్తా:- విశ్వావసూ! మరియొకమాట.

విశ్వా:- దేవరవారు సెలవీయ వేడెదను.

భుక్తా:- యోధపురసామంత జాగీరు వారలును, దుర్గాధ్యక్షులును, విద్రోహుల కాశ్రయము నొసంగవచ్చును కావున, మనకులోబడి యున్న సర్దారులకును, జాగీరుదారులకును, దుర్గాధ్యక్షులకును, వెంటనే విద్రోహులజాడల నరసి దెలుపవలెననియు, వారి కాశ్రయమిచ్చినవారుగాని, వారిజాడల తెలిసియు, తెలుపని వారుగాని శత్రులక్రిందనే పరిగణింప బడుదురనియు, వారిపద వుల గోల్పోవుటయేగాక, రాజాగ్రహమునకు కఠిన శిక్షలకు పాలుగావలసి యుండుననియు తాఖీదుల నంపుము.

విశ్వా:- రాజ్యరక్షణకై దేవరవారెట్టి చర్యలనైనను, గైకొనవలసినదే.

భుక్తా:- వారెల్లరు నీ తాఖీదు లందుకొనిన నెలదినములలోగా యిచ్చ టికి వచ్చి రాజభక్తిప్రమాణముల నొనర్పవలెను. మీరిరువు రును, కడుంగడు జాగరూకతతో మెలగవలయును. మనచా రులు నానారాష్ట్రములకేగి, శత్రువులజాడ దెలుసుకొనవలెను.

వీర-విశ్వా:- జై, భుక్తాసింగు మహారాజా బహద్దరు వారికి జై.

(తెరపడును)

## రంగము 3.

స్థలము - కళ్యాణదుర్గము - బలవంతసింగు రాజమందిరము

ప్రవేశము—బలవంతసింగు, అజితసింగు.

బల:- పోక తప్పదందువా ?

అజి:- తప్పునో, తప్పదో, రాజాజ్ఞ. అందును, చండశాసనుండగుభుక్తా సింగు దారుణశాసనము నతిక్రమింప నెవ్వరు సాహసింతురు ?

బల:- నిశ్చయమే. పొరపాటు. పాపము అమరసింహునకు రాజ్యభ్రష్టుడై యెటకేగెనో ! యెట్టియిడుములఁ గుందుచుండెనో ! సహజముగ సౌజన్యశీలుఁడు. ప్రజానురంజకుఁడు.

అజి:- అతని సౌజన్యత, ప్రజారంజకత్వము, ఆతని కాపాడఁగల్గెనా ? "ధరణీరాజ్యము వీరభోజ్య" మన వినలేదా ? సృష్టియందెచ్చట జూచినను, బలవంతులు బలహీనులపాలిటి పరాక్రమించుటయే గాననగును. జలచర, భూచర, ఖేచరములందెచ్చట వెదకినను యీ ధర్మమే చెల్లుచున్నది.

బల:- భుక్తాసింగు పరాక్రమవంతుఁడే. కావుననే, అమరసింహుని నిర్జింపఁగలిగెను. అజితసింహా! ఈవిషయము నీవెఱుంగుదువా ?

అజి:- ఏ విషయము ?

బల:- ఇందెవ్వరును లేరుగద? గోడలకు చెవులుండునందురులే. అమరసింహుఁడు, పినతండ్రియగు భుక్తాయుందత్యంతగౌరవ ప్రపత్తులతో మెలంగెడివాఁడు. కా——కాని——బయట చూడుము—— ఎవ్వరును లేరుగద. భుక్తాసింగ రాజ్యాశాపీడితుఁడై యమరసింహుని బంధించి రాజ్యాపహరణమునకు ప్రయత్నించెను. జనార్దనమంత్రి ప్రతిభావిశేషమున యీ కుట్ర బయటపడెను. కాని పితృసమానుఁడగు పినతండ్రికి మరణదండన విధింపనేరక యమరసింహుఁడు భుక్తాను రాష్ట్రమునుండి మాత్రము వెడలఁగొట్టెను.

అజి:- దానికి తగిన ఫలము నేఁడనుభవించెను. చేతికిఁదొరికిన శత్రువును సంహరింపకపోవుట యెంతటి యవివేకము. ఆర్యధర్మములని యిట్టి రాజనీతి ననుసరించుటచేతనే, మనరసపుత్రులీనాఁడు నానా మహాత్రపవిష్టులై పరరాజులఁగొలిచి బ్రతుకవలసె. కలియుగంబున, అంచేను నేటిభారతమున కౌటిల్యనీతిప్రయోగింపవలెను గాని, మరియొండు మార్గము లేదు. ఇంతకును రాధపురప్రయాణము మాట మరచితిరి,

బల:- పోకతప్పదు—కాని—ముక్త—అబల—అమాయిక—ఒంటరిగా నెన్నడును, యుండి యెరుగదు. ఆమె యీవియోగము నెట్లు భరింపగలదని యోజింపుచుంటిని.

అజి:- (తనలో) పాపమీ ముదుసలికి వడుచు భార్యయుండెంతటిముచ్చటవా! (ప్రకాశముగా) పోనీ యీమెను గూడ దీసికొని పోరాదా?

బల:- అమ్మయ్యో! అదిమాత్రము వల్లకాదు. ఈదుర్గమారణ్యమార్గముల—ఈవిప్లవదినములలో—ఆడువారితోడి ప్రయాణమే! ముక్తవంటి అమాయికురాలితో. వలదు, వలదు. అసలు ముక్తకు ప్రయాణములందుగాని, విహారములం దుగాని, ఆసక్తియే లేదు. మరచితి—నాప్రతినిధిగా నీవు యోధమురమున కరగి రాజభక్తి ప్రయాణమును జేసిన ప్రమాదమేమి?

అజి:- భుక్తాసింగు కడు మాయావి. ఆపులించిన ప్రేవులు లెక్కడగలడు. నీవు స్వయముగా నరుగకున్న, నీ కాతని పాలనయందిష్టము లేక మొగము చాటువైచితివని భావింపగలడు.

బల:- అవునుసుమా! మంచియాలోచన జెప్పితివి. నీవు కడు మేధావివి. ఎంతదూరమాలోచించితివి? తప్పక చిక్కులలో పడియుండెడివాడనే. భుక్తాయాగ్రహమునకు గురియైయుందును. అయితే ప్రయాణము తప్పదనియే నిశ్చయించితివి.

(గోపాలవర్మ ప్రవేశము)

గోపా:- రాజా! నేనిటవచ్చుచుండ ప్రాంగణమున, కొందరు చాటసారులు వేచియుండి, యీ లేఖను తమకంద జేయుమని యొసంగిరి.

బల:- అయ్యో! దైవమా! మరియొక తాకీదు కాబోలును. ఈ భుక్తాసింగు మనల నీ మన్యదుర్గమునగూడ నిలువ నీయడు కాబోలు. గోపాలవర్మా! ఆ లేఖను నీవే వచింపుము.

గోపా:- (లేఖను విప్పి చదువును) "పితృసమానులును, కళ్యాణదుర్గాధ్యక్షులునగు శ్రీ శ్రీ శ్రీ బలవంతసింగు బహద్దరు మన్యసుల్తాను వారి దివ్యపాదారవిందములకు—

బల:- లేఖప్రారంభము చాల గౌరవసూచకముగనే యున్నదే! లోని విషయము లెట్లున్నవో! భుక్తా సింగింత మర్యాదగ వ్రాయుట జూడ—

అజి:- లేఖను పూర్తిగా చదువనిండు.

గోపా:- "నిత్యానేక వందన శతంబు లాచరించి"

బల:- వందన శతంబులే! భుక్తాసింగు! నాకు! యేదోమాయ పన్నుచున్నాడు. తరువాత?

గోపా:- "రూపుసింహు వ్రాయున దేమన"

బల:- రూపుసింహుడా? ఏరూపుసింహుడు? మనరూపుసింహు గతించి అయిదేండ్లయినదే!

గోపా:- చివరవరకును చదువనిండు. అంతయు విశదము కాగలదు.

బల:- ఆహా! రూపుసింహుసజీవుడైయుండెనా? అత్యాశ్చర్యము. గోపాలవర్మా! తుదవరకును చదువుము.

గోపా:- "ఆనాడట్లు తమవద్ద సెలవుగైకొని, విదేశయాత్రా కౌతూహలినై కాందహారు చేరితిని. ఆ ప్రభువు నా రణకౌశల్యమును, పరాక్రమ విజృంభణమును దిలకించి, తనయాస్థానమున గౌరవ మర్యాదల నొసంగి, పిమ్మట నన్నాదరించి, బహూకరించి, తన సేనానులకు వ్యూహనిర్మాణాదుల నేర్పుబనిచెను. ఇట్లుండనొక నాడాకస్మికముగ పారశీకభూజాని మాప్రభునిపై దండెత్తెను. సంకులసమరంబుసాగె. తీవ్రగాయములకు గురినై ఆరణభూమి నేను మూర్ఛిల్లితిని. నేను మేల్కాంచు నప్పటికి పారశీకుని శిబిరమున బందెగానుండుట దెలిసికొంటిని. కాని యీ మాప్రభువు

నా కరలాఘవంబును, పరాక్రమలీలను, రణోత్సాహమును, ప్రత్యక్షముగ వీక్షించుటచే నద్భుతాశ్చర్యనిమగ్నుడై నన్నాదరించి యెంతయు ప్రశంసించెను. నాటినుండిపారశీకముననుంటిని. నే నాహవరంగమున గూలుటయేగాని, పారశీకునిచే గొనిపోబడుట యెఱుంగని మా సైనికులు నేను గతించితిననియే భావించిరి.

"ఎట్టిప్రశంసల నందినను, జన్మభూమిని చేరవలెననెడి కోర్కెచేతను, నా శక్తిసామర్థ్యముల నామె సేవకై వినియోగించు వాంఛచేతను స్వదేశమునకు పయనమైతిని. కాని మిత్రుండగు కాందహారుప్రభుని బలవంతముపై మార్గమధ్యమున నాగవలసి వచ్చినది. కొలదికాలములలో తమ పాదసేవ యొనర్పరానున్న

భవద్దర్శనాభిలాషి,

రూపుసింహుడు."

బల:- అజితసింహా! వింటివా? మన రూపసింహుడు సజీవుడై విక్రమోపేతుడై, తిరిగివచ్చుట నేడెంత శుభదినము. గోపాలవర్మా! రూపు విదేశరాజుల మన్ననలకు పాత్రుడై, బహూకృతుడై నాకు నేత్రోత్సవ మొనర్పరానుండెను.

అజి:- (తనలో) ఈముదుసలి యానందమునకు మేరలేకున్నదే.

బల:- అజితసింహా! ఏమూరకున్నావు. రూపుని రాక నీకానంద మొసంగుటలేదా ?

అజి:- తండ్రీ! ఆనందోద్రేకమున, డగ్గుత్తికపడి మాటరాదాయెను. ఎన్నడో మృతుడయ్యెనని తలంచిన ప్రియసోదరుని యాగమనము, మోదమొసంగకుండునా ? నేడు నిశ్చయముగా పర్వదినము.

బల:— గోపాలవర్మా! అజితరూపసింహులు పసివారలై యుండ, వీరి తండ్రి నా సోదరుడు, అకాలమరణము నొందుటయు, నాటి నుండి వీరిని నా పుత్రులవలె నాదరించుటయు, మరపురాని గాథలు.

గోపా:— రూపసింహుని శైశవంబున మోసి, మోసి, యీ మూపులు కాయలు కాచినవి. భర్తృమరణవార్తవిని, వీరి జనని, సహగమనము సేయ, వీరిరువురను పెంచి పెద్దవారలజేసిన దెవరు? రూపసింహుని యసత్యాపహరణవార్త పిడుగువలెసోక, పెంచిన మోహమున నాయిల్లాలసువుల బాయుట తా మెరుంగరా! రూపునిరాక, యీ రాష్ట్రమునకు రాకయని భావింపనగు. తొల్లింటి రాజపుత్రవీరుల యశశ్చంద్రికల దశదిశల ప్రసరింప జేసి భారతదేశ గౌరవమును ప్రతిష్ఠించిన రూపుని యెన్నివిధముల ప్రశంసించినను దనివితీరదు.

అజి:— అత్యానందమున మీ రిరువురును, కర్తవ్యతా విమూఢులగుచున్నారేమోయని భావింపుచున్నాను. జోధపుర ప్రయాణము భక్తాసింగు తాకీదు వీనిగూర్చి యించుక యోజింపుడు.

బల:— రూపు నేడో రేపో రానైయున్నవాడు, అతడు వచ్చిన పిమ్మటనే యీ ప్రయాణమును గూర్చి యోచింతము. అజితసింహా రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు)

## రంగము 4

స్థలము: అజితునిమందిరము.

కాలము: ఉదయము

ప్రవేశము: అజితుఆలోచనతో

అజితు:— రేయెల్లనిద్దురలేదు. ఆలోచనాపరంపరలో నిమగ్నుడనై కర్తవ్యతా శూన్యుడనైతిని. అడుగో ఉదయభానుడు. నిశాగరంబు

లచే అంధకారపటలి బటాపంచలు చేసి, దివ్యతేజస్సును దశదిశల బరపి కువలయానందు డగుచున్నాడు. నాయాశాజ్యోతినికూడ వెలిగించునా? అజితసింహా! నీవెన్నడును పరాజయ మెరుంగవు. భీరువువలె నిట్లు డోలాయమానుండవగుట హాస్యాస్పదము. (బల్లమీఁదనున్న రూపుని లేఖదీసి) మొహారు—రూపునిదే. వ్రాలు-అక్షరమాల—నిస్సందేహముగ నాతనివే. రూపు సజీవుఁడనుటకు సందియము లేదు—ఊఁ—నాయాశా సౌధనిర్మాణమునకంతరాయము గల్పించుచుంటివా? ముదుసలియైనేడో రేపో వ్రాలనున్న యీబలవంతుని యధికారపదవిని నిర్విఘ్నముగ స్వీకరింపనున్న నా కీయాటంకమా? రూపుని యాగమన వార్త వినినంతనే యీ ముదుసలి కెంతసంతోష ముదయించినది! ఇన్నివత్సరములనుండి తన్ననుదినము ననుసరించియున్న అజితునిగతియేమి? జరుగదు. అట్లుజరుగనేరదు. తనకును తన యనంతరము రూపునకును దాస్యమొనర్పుట కీయజితుఁ జన్మింపలేదు (ఆలోచనతో) అజితుని శక్తిసామర్థ్యములు, అజితుని తంత్రప్రయోగములు, అజితుని కార్యసాధనానైపుణ్యత ప్రదర్శించుటకు తరుణమేతెంచినది. రూపు—దేశాంతరగతుఁడైన రూపు—పరమపదుఁడైన రూపు—విక్రమోపేతుఁడై స్వదేశముఁకరుదెంచునట. బలవంతుఁడు తనసర్వస్వ మొసగి యాతిథ్య మొసంగునట. జరుగనేరదు. ముమ్మాటికిని జరుగనేరదు. (గవాక్షమునుండి బయట చూచి) అలీ! అలీ!

అలీఖాఁ—(ప్రవేశించి) జీ! సర్కార్! సలామాలేఖుం.

అజి—(వానివైపు చూడకయే) నీవు వట్టిమూఢుడవుసుమా!

అలీ—జీ! సర్కార్! తముప్పాలాషార్లుసెప్పినార్.

అజి—ఏమిచేయుచున్నారు?

ఆలీ:— సర్కార్ యెదుట నిల్చియున్నామ్.

అజీ:— అదికాదురా మూర్ఖా! లోనికి ప్రవేశించుటకుపూర్వ మేమి చేయుచున్నావూ? అని.

ఆలీ:— దర్వాజాకె బాహార్ పహారా సేస్తున్నామ్.

అజీ:— (పచారుచేయుచు గవాక్షమునుండి బయటచూచి) బయటనెవ రున్నారు?

ఆలీ:— మేము పహారా సేస్తుండామని తమ్కు మన్వి సేశాము సర్కార్.

అజీ:— ఛీ! మూర్ఖా!

ఆలీ:— జీ! సర్కార్.

అజీ:— ఇటు నెవ్వరును పోలేదా?

ఆలీ:— మా కీచూపుల్కె తగ్లేను సర్కార్.

అజీ:— నీపహారా యిదియేనా?

ఆలీ:— మేం, పహారాచేసేతప్పు—మాదీనూవు—పహారామీాదే నిల్చియుంటుంది సర్కార్. బయటవచ్చిపోయేమనుసుల్కు నూడడాన్కి—మేం పహారా యిడ్చియెల్లం సర్కార్.

అజీ:— మంచిపహారాయే. ఇటురా! ఈగవాక్షమునుండిచూడు.

ఆలీ:— సర్కార్.

అజీ:— అక్కడ యేమి కనబడుచున్నది?

ఆలీ:— (అట్లే చూచుచుండును) బాగ్ దిఖాతాహై.

అజీ:— మూర్ఖా! మరియేమియుచూడలేదా!

ఆలీ:— ఆకాశాన సూరజ్, భూమిమీాద మొక్కల్; మొక్కల్ మీాద పూల్ ఉన్నాయి సర్కార్.

అజీ:— నీవు పట్టి పశువువు.

ఆలీ:— జీ! సర్కార్! తమ్ము)మేలాయేస్తార్. తమ్కు సేవా సేస్తాం.

అజీ:— అటుచూడు. ఆపూలమొక్కలనడుమ నెవరు?

అలీ:- హదడీ మాకీసూకాం. అది హాడ్వ్యాడ్‌మాదిర్‌ఉంది.

అజి:- ఆమె యెవరో సరిగాచూడుము.

అలీ:- సచ్‌హై అదీ హాడ్వ్యాడ్‌సర్కార్.

అజి:- ఛీ! వదరుబోతా! ఆమెకమలయేనా! చూడుము.

అలీ:- సర్కార్—హాస్త్రగారి కన్ని ఖమలమ్మ అదే సర్కార్.

అజి:- నీవు వెంటనేపోయి, ఆ కమల నిటుదీసికొనిరా. అధికప్రసంగము చేయక, అజితసింహులు లోకసారి యిటురమ్మనిరని చెప్పుము.

అలీ:- జీ! సర్కార్! (సలాంచేసిపోవును.)

అజి:- ఈ కమలను చూడగనే నాకొక యూహపొడమినది. అది ఫలించునా?—అజితసింహా! నీవు కృతకృత్యుడ వగుదువా? ప్రయత్నించిన, ఫలింపకుండునా! ఈమె బలవంతసింహుని పట్టపు భార్యకు అంతరంగిక యరణపు పరిచారిక. ఈమెనాకు బాగుగ నుపకరింపవచ్చు.

అలీ:- (కమలతో ప్రవేశించి) సలాం, సర్కార్‌వార్కి! ఖమలమ్మగార్కి మీకీ దఖల్ చేస్కున్నామ్.

అజి:- నీవు బయట నుండుము. ఎవరినీ రానీయకుము.

అలీ:- సిత్తం-సిత్తం (సలాము చేసిపోవును)

అజి:- కమలా! ఉదయభానుని, కరస్పర్శచే వికసితమైన కమలముల శోభను హసించు, నీముఖకమలము కమల యను నీనామమును సార్థక మొనర్చినయది.

కమ:- అతిశయోక్తి. నాకు సామ్యమువనే శోభ యలవడునా?

అజి:- నిజముగా. ముఖస్తుతియని భావింతువేమో కాని, నీయనన్య సామాన్య సౌందర్యము, నీవిలాస సంపద, నీసౌజన్యత, నీ సుమధుర వాక్సుధ, నీనిర్మలభావము, యెట్టి రాజమాతల కైనను యలవడుట దుర్ఘటము.

కమ:– ఆర్యా! మీరేమో వింతగ మాట్లాడుచున్నారు. నన్ను పిలిపించిన కారణ మేమో తెలుపగోరు చున్నాను.

అజి:–ఇంచుక కూర్చుండుము. కమలా! నిన్ను చూచినపుడెల్ల నా భావ పరంపర తుపానువలె చెలరేగు చుండును. ఇంతటి లావణ్యతగల యీ లతాతన్విని సృజించిన బ్రహ్మ ఒరుల కూడిగముసేయ లిఖించుట, వాని చంచలభావము నెంతయు చాటుచున్నది సుమా!

కమ:– అయ్యా! నేను వేగ మేగవలయును. మా చెలి వ్రతపూజకు, కుసుమముల కూర్పవలయు, నాకు సెలవొసంగుడు.

అజి:– కమలా! ఏమి యీ మాటలసొంపు. నిశ్చయముగ నీ విట్టి యూడిగమునకు తగవుసుమా!

కమ:– అయ్యా! నన్నేల యెగతాళి చేయుదురు? ఎట్టి యాశల గల్పించినను, యీ కమల దీనయగు తన నెచ్చెలిని వీడునంతటి సాహసికు రాలు కానేరదు. తన జీవితము నామె సేవకై యర్పించిన యది.

అజి:–ఏమీ! మీ నెచ్చెలి దీనయా? వింతగ మాట్లాడుచుంటివి. కళ్యాణ దుర్గాధ్యక్షుడై, మన్యప్రాంతములకెల్ల మేటిప్రభువై, సకల దాసదాసీ జనముచే పరివేష్టింపబడి, ఐశ్వర్యవంతుడగు, బలవంతసింగును, మా పెదతండ్రిని చేపట్టిన, మీ నెచ్చెలి దీనయా? కమలా! ఇంతకన్న యదృష్టవంతు లెవ్వరు?

కమ:– అయ్యా! ఎందరు దాసదాసీజనంబులు గాని, యెంతటి యైశ్వర్యముగాని, మా నెచ్చెలికి హాయిగూర్పకున్నవి. ఆమె మనోవీధి నెల్లపుడును కారుమబ్బులు క్రమ్మియుండును, మానసికముగ గొప్ప యాతన ననుభవించుచున్నది.

అజి:– అట్లనా! అంతటి మనోవ్యధకు కారణమేమై యుండునో,

కమః- (కండ్లనీరుగ్రమ్మ పూర్వగాథను జ్ఞాపకము చేసుకొనుదానివలె) అదియొక పెద్దగాథ; విషాద ప్రణయగాథ.

అజి:- అయ్యో! నే నన్నదెరుంగనే, అట్టి స్త్రీరత్నమున కుపకరింపని నా జన్మ మేల? ఆమె యాతన గడువబెట్టుట నావశమగు నేని, వేగ మెరింగింపుము. సంసిద్ధుడ.

కమః- మీరు కాదుగదా, ఆదైవమైనను, ఆ యాతన తొలగింపలేడు. ఎంతటి యాత్మార్పణము! ఎంతటి త్యాగము! స్త్రీ మాత్రమే యట్టి త్యాగమొనర్పగలదు. అట్టి త్యాగమూర్తి సాన్నిధ్యమున నెల్లప్పుడు వర్తించు నేను, స్వసుఖము నొల్లకుండుట యొక ఘనతయా?

అజి:- కమలా! మీ నెచ్చెలి ప్రసంగమును దెచ్చి, నీ హృదయమున గొప్ప యారాటమును, ప్రేరేపించితి ననుకొందును. నిన్నింత కలవరపరచిన, యా విసాదగాథ నెరింగించి, నీహృదయ భారమును కొంత పంచియిమ్ము. అయ్యో! మా పెద తల్లి తీవ్ర వ్యథను దెలిసికొన నామన మెంత తొందరపడు చున్నది.

కమః- మా నెచ్చెలి చిరుతప్రాయము నుండియు, రూపుసింహుని ప్రేమించిన యది. వారిప్రేమ, దినదిన ప్రవర్ధమానమై, అనంతమై, అచంచలమై, తనరారజొచ్చినయది. ముక్తాబాయి దలిదండ్రులు కూడ రూపునకామె నీయవలెననియే నిశ్చయించిరి. కాని రూపుసింహుడు యశఃకాముడై విదేశంబుల కరుగుటయు, పిదప కొన్ని వత్సరము లాతని వార్తయే తెలియకుండుటయు, పిమ్మట యాతని యకాల మృతవార్త వినుటయు తటస్థించినది.

అజి:- ఎంత చిత్రము! ముక్తాబాయి బలవంతుని యిల్లాలగుట యెట్లు సంభవించెను?

కమ:- ముక్తాబాయి యీ దారుణవార్త విని జీవచ్ఛవంబువోలె ప్రొద్దు పుచ్చుచుండెను. ఆమె తండ్రి బలవంతసింహునకు ఋణపడి యుండెను. అది సాకుగాగొని, బలవంతుఁడు ముక్తను తన కొసంగినచో ఋణవిముక్తుని జేసెదనని కబురంపెను. ఆమె తలిదండ్రులు, బలవంతుని, తిరస్కరింప నేరకయు, ముక్త యభీష్టమున కెదురాడ నేరకయు, కటకటంబడిరి. బలవంతసింహుని బలవంతము హెచ్చినకొలదియు వారియాతన యధికమయ్యెను.

అజి:- పాపము! ఆతలిదండ్రులు, బలవంతుని తిరస్కరించిన, తమసర్వస్వము నాశనమగునని భయపడిరి కాబోలు.

కమ:- భయపడుటయేకాదు, బలవంతుడు తనకోర్కె నెరవేర్పకున్న వారి వినాశనము తప్పదనియే కబురంపెను. ఇది యంతయు కనిపెట్టుచున్న ముక్తాబాయి, తలిదండ్రులను, విపత్సముద్రము నుండి తప్పించుట కాత్మార్పణ మొనర్చెను. స్త్రీ తప్ప యింతటిత్యాగ మొనర్ప నెవ్వరు సమర్థులు ?

అజి:- ఎంతటివిషాదగాథ! నిస్సహాయయువతి, నీనెచ్చెలి కనవరతము సేవయొనర్చు, నీభాగ్యమే భాగ్యము. నీసుఖమును, నీభావి సౌభాగ్యమును కూడ గణింపక, యామె సేవకై యాత్మార్పణ మొనర్చిన, నీత్యాగ మామెత్యాగమునకన్న వేయిమడుంగు లధికము. కమలా! త్యాగమూర్తివి. నిశ్చయముగా నీయట్టి స్త్రీరత్నమును చేపట్టగల్గినవాని జన్మయే సార్థకము.

కమ:- ఆర్యా! మీ పొగడ్తకు నే నర్హురాలనుగాను. నేనొక యువకుని చేబట్టి, నాచెలిని విడనాడజాలను. ఈ కమల కట్టి ద్రోహచింత యెన్నడును జనింపదు.

అజి:- కమలా! నేను మాత్రము నీ నిశ్చయమున కెదురుచెప్పగలనా? నిన్ను చేపట్టదలచిన యువకుడు, నీయభిప్రాయముల నెరింగి,

వానిమన్నించి, తదనుగుణముగ వర్తించునేని, నీయభ్యంతర మేమి ?

కమ:- అయ్యా! ఏమి యీ విషమ ప్రశ్నలు ? నానెచ్చెలి సౌఖ్యమే నాకు ప్రధానముగాని, నా సుఖముగాదు.

అజి:- ఒకవేళ నీనెచ్చెలినుండి నిన్ను వేరుజేయుక, నీయాశయముల కంతరాయము గల్పింపక, నీకనువర్తియై జరించుటకియ్యకొను యువకుడు లభించెనేని, వాని చేబట్టుదువా ?

కమ:- (ఆశ్చర్యపడి పలుకనేరక యూరకుండును).

అజి:- కమలా ! నిన్ను జూచినదాదియు, నీ సౌజన్యత నా మనము నాకర్షించినది. నేనింతదనుక నవివాహితుడ నగుట నీయట్టి కన్యారత్నము లభింపకుండుటయే. నీవు నీ నెచ్చెలిని వీడ నక్కరలేదు! నాజన్మ సార్థకమొనర్పుము. చూడు—(అని చేయి పట్టుకొనును).

కమ:- ఆహా ! నే నేమైతిని. ? నాతల తిరుగుచున్నది. నాచేయి వదలుము (అని చేయి విదల్చుకొని) నాచెలి పూజాసమయము మరి క్రమించుచున్నది. నే పోవలయును.

అజి:- కమలా! ఆలోచింపుము. తొందరలేదులే. నీయట్టి లావణ్యవతిని, సుగుణఖనిని చేపట్టి యానందడోలికల నోలలాడింపనున్న యీ అజితుని మరువకుము.

కమ:- అయ్యా! నాకు సెలవొసంగుడు, నేనుపోయివచ్చెద. (పోవును)

అజి:- ప్రదర్శనము బాగుగనే నడచినది. అంత పాడుగలేదు. (ఆలోచించి) ముక్తారూపుల ప్రణయగాథ-అక్కరకు రాగలదు.

కమ:- (తిరిగిప్రవేశించి) అయ్యా! మీసేవకుడు నన్ను పోనిచ్చుటలేదు.

అజి:- అలీ !

అలీ:- (ప్రవేశించి) సలాం సర్కార్, ఏమి సెలవు?

అజి:- ఏమిరా పొగరు ? ఈమెనేల యాటంకపరచితివి ?

ఆలీ:- సర్కార్—మీరు సెప్పిందిలాగ సేశామ్.

అజి:- ఏమిరా నీకు చెప్పినది ?

ఆలీ:- సర్కార్. 'ఎవర్నీరానీకు' అని సెప్పినార్. అందుక్కే సేత యీ హమ్మగార్కి లోపలున్నుంచి రానీలేదు సర్కార్.

అజి:- ఛీ ! మూర్ఖా ! ఎవరినీ రానీకుమని చెప్పినందులకా యిది. కమలా! వీడు శుద్ధమూర్ఖుడు. మరియొకలాగు తలంపకుము. ఈమెను తుచ్ఛపూర్వణ వేయుము. స్త్రీ ఎన్నడును యీమె ప్రవేశమున కభ్యంతర పెట్టకుము. తెలిసినదా ? జాగ్రత్త.

ఆలీ:- (వంగి) హమ్మగారూ ! ఖమ్లమ్మగారూ ! మాకీ మాఫ్‌కీజియే. మీకీ సలాంసేస్తాంమ్.

కమ:- (నవ్వుచు పోవుచు).

(తెరపడును)



ఓం:



# రాజ్యాకాంక్ష

## ద్వితీయాంకము

### రంగము 1

స్థలము: అరణ్యము

ప్రవేశము: అమరసింహుఁడు కూర్చునియుండును. ఎదుట భిల్లులు నృత్యగానములు చేయుచుందురు—అనంతరము.

వీరమల్లు:- ఏలికా! తమ సెలవైన, యీభిల్లుల వారివారిపనులపై పంపెదను.

అమర:- అట్లేకానిమ్ము.

వీర:- ఓరీ! రాయగడా! నీవు నీమూకతోఁ బోయి, యీయడవియందు నలుదిక్కులు పరికించి, క్రొత్తమానిసు లెవ్వరైనను కనబడినచో వెంటనే బంధించి తీసుకొనిరా. ఓరీ! జెగజెట్టి! నీవు అమరసింహ మహారాజులుంగారికి యేయాపదయు రాకుండ యెడనెడ కావు కాయుచుండుము, ఓరీ! గడానాయకా! నీవునీయనుచరులతోఁ నేఁడు వేటకరుగుము. ఇది మనయేలిక బలదేవులవారి యాన. త్వరగపొండు.

భిల్లులు:- దండాలుసామీ! దండాలు. అమరసింగ మారాజులకుజై.
(పోవుదురు)

అమ:- వీరమల్లూ! మీయాతిథ్యమును మేమెన్నడును మరువజాలము. ఈయరణ్యమునందు సహితము, మాకెట్టిలోటును రానీకుండ వేయివిధంబుల కనిపెట్టుచున్న శ్రీబలదేవుని యొక్కయు, అంతకు పదిరెట్లు కంటినిరెప్పవోలె గాచుచుచున్న మీయొక్కయు ఋణ మెట్లు తీర్చుకొనగలమో తెలియకున్నది.

వీర:- అయ్యా! యోధపురమున కధినాథులై సకలభోగముల ననుభవించు మీరు, నేడొకభిల్లనాయకుని యాతిథ్యము నింతగా కొనీయాడుట తమకు మాయందుగల వాత్సల్యతను దెలుపుచున్నది.

అమ:- వీరమల్లూ! మీ రెంతటియాదరము చూపుచున్నను, దురాత్ముడును, మాయావియు నగు, భుక్తాసింగునకు తగిన ప్రతీకార మొనర్చినగాని, నామనము శాంతినొందదు; పావన లూనానదీ తోయముల నోలలాడి, యోధపుర గిరిదుర్గప్రదేశముల విహార మొనర్చి, భుక్తాను రణరంగమున నోడించి బందిగాగొన్నగాని యమరసింహునకు నిద్రయుండదు.

వీర:- దేవా! కాల మెల్లపుడు నొక్కమాదిరియుండదు. అమవసపోయిన పున్నమ రాకపోదు. బలదేవులు సర్వసన్నాహమును చేయుచున్నారు. బలవంతుడును, మీదుమిక్కిలి కుత్సితుడునునగు, భుక్తానుజయించుట యంతగాదు. త్వరలోనే మనప్రయత్నములు ఫలించుగాక.

(ప్రవేశము: ఒకభిల్లుడు)

భిల్లు:- జయము, జయము దేవరవారికి. బలదేవరాజులుంగారు మరొక క్రొత్తమానిసితో వచ్చుచున్నారు.

అమర:- రానిమ్ము. (భిల్లుడుపోవును)

(ప్రవేశము బలదేవుఁడు: జనార్ధనశర్మ)

అమ:- (లేచి నమస్కరించి) ఆహా! ఎవరో యనుకొంటిని, నాపాలి దైవమే! మహామంత్రులు జనార్దనులకు మాయభివాదము.

జనా:- అభీష్టసిద్ధిరస్తు. వత్సా! కుశలమా.

అమ:- మాపాలిట జనార్దనులగు, శ్రీమన్మహామంత్రి జనార్దనులవారి కటాక్ష ముండ, కుశలమున కేమిలోటు. శ్రీబలదేవుఁడు తన బలమునెల్ల నా రక్షణకై వినియోగించెను. నాకు యోధపురమున కంటకునిచ్చుటనేసదుపాయము లెక్కుడు సమకూర్చుచుండిరి. బలదేవుని ఋణమెట్లుతీర్చుకొందునో తెలియకున్నది

జనా:- వత్సా! ఆతని రాజభక్తియట్టిద. భుక్తాసింహు దారుణశాసనములకు, సామంతులెల్లరు, భయకంపితులై జోహారు లొసంగ, అరణ్యకపరిభువగు, ఈబలదేవుఁడు, ధర్మరక్షణకై, యాతని ప్రతిఘటించి, తమ కండయైనిలిచె. ఆర్యులము, నాగరికులమని పరిత్యజించి, భీరువులై దుష్టపరిపాలనకు తలయొగ్గియుండ, దుష్టశిక్షణ శిష్టరక్షకుండగు యాపరమేశ్వరుఁ డీబలదేవరూపమున ధర్మప్రతిష్ఠాపన గావింప సంకల్పించి యుండబోలును.

బల:- దేవా! మీారెద్దియోయాయాటవికుని పెద్దజేసిపల్కుచుండిరి, చిరకాలమునుండియు, యోధపురసామ్రాజ్యము ప్రాపునజేరి, స్వచ్ఛందవాయువులబీల్చుచు, వీరవిహారముచేయుచున్న, వారి కాతిధ్య మొసగి, బాసటయైనిలుచు టొకఘనకార్యమని తలంచుటలేదు. మేముచేయవలసినవిధిని, నిర్వర్తించినపుడు దానినింతగపొగడనక్కరలేదు. మహారాజులును, మహామంత్రులును, మమ్మాజ్ఞాపించి, యీాభృత్యునివలననగు సేవలందుకొనప్రార్ధన.

అమ:- బలదేవా! నీవాక్కులు, నీ సౌహార్ద్రతను, దెలుపుచున్నవి. సభ్యజాతులమని గర్వించువారు, సాహసింపని కార్యమునకు,

నీవు సిద్ధపడుటచేసి, ప్రస్తుతింపవలసె. ఆర్యా! మీరాకను గూర్చి చెప్పరైతిరి? మనయత్నము లెట్లున్నవి?

జనా:- శ్రీ మన్మహారాజులవారు సపరివారముగ, నిర్ణీతప్రదేశమున సుఖులైయుండిరి. వారికేలోటును రాకుండ సమస్తమైనయేర్పాటులు చేయుటమైనది. ఇక శత్రుపీట మన చారు లతిచాకచక్యముగ, మెలగుచున్నట్లువార్త లరుదెంచుచున్నవి. త్వరలోనే మహావిప్లవ మగ్నిపర్వతమువలె విజృంభింప గలదు. భుక్తాయందలి భయాతిరేకమున బయట పడలేకున్నను, అసంతృప్తి యందరి యందును వ్యాపించియున్నది. సమయమునకై వేచియుండిరి. భుక్తాసింగు దారుణశాసనము లధికమైన కొలదియు, సామ్రాజ్యము నందలి విప్లవోద్యమమునకు మరింత దోహదముగలుగుచున్నది.

అమ:- ప్రజలయందు నిరాశ, నిస్పృహ, యావహింపకమునుపే, యీ విషమపరిస్థితు లంతరింపజేయు, సర్వప్రయత్నములు జరుగుచున్నట్లును, యీ దుష్టనియంతపరిపాలన మనతికాలముననే తుదముట్టుననియు, రహస్యప్రచార మవసరమేమో ! త్రికాలవేదులు తమకు నేను చెప్పదగినవాడను గాకున్నను, చాపల్యమున చెప్పసాహసించితి.

జనా:- వత్సా! అమరసింహా ! సర్వమును సంసిద్ధము. ప్రజలెవ్వరును యీ పరిపాలనకు సుముఖులుగాలేరు. కాని, సామంతులును, దుర్గాధ్యక్షులును, రాజసేవకులును, తమ పదవులకై ప్రాకులాడుచుండిరి. వారైనను, భుక్తాయందలి సదభిప్రాయముచే గాదు. విద్రోహ ప్రయత్నములు విఫలమైనచో తాము బయట పడిపోవుదుమనియు, భుక్తా ప్రతిక్రియకు బూనుననియు భయము చేత. మనసన్నాహములు, సంతృప్తికరముగ సాగి,

విజయసాధనములగునేని, సర్వతోముఖమగు సహాయసంపత్తి సమకూడుటలో నాశ్చర్యము లేదు.

అమ:- ప్రస్తుతము మనకు బహిరంగముగ బాసటయై నిలిచిన దీ బలదేవుడును, నాతని యాటవిక బలమును.

జనా:- ఈయాటవికు లసమాన బలశాలురు. భక్తి కుదిరెనేని ప్రాణ మర్పింతురు. వీరిని, నవీన రణకౌశలమున సుశిక్షితుల జేసితి మేని అజేయులగుదురు. చంద్రగుప్తుని మగధసామ్రాజ్యమున ప్రతిష్ఠించిన దీ భిల్లసైనికు లేగదా!

బల:- ఆ చాణక్యుని ప్రతిభయే భిల్లనాయకుల శౌర్యసాహసముల జగద్వంద్యమొనర్చినది. అపరచాణక్యులగు యీ గురుదేవుల నమ్మిన మాధైర్యస్థైర్యములు వృథగావని మా నమ్మిక.

జనా:- వత్సా! చూచితివా! యీబలదేవుని వాక్చమత్కృతి. బలదేవా! మనమింకను, యాధునిక మారణ యంత్రముల సమకూర్చవలయును. నవీనపద్ధతుల మన సైనికులకు శిక్షణ మొసంగవలయును.

బల:- దేవా! ఈ భిల్లు లాబాలగోపాలమును, మీరెట్లానతిచ్చిన నట్లు వర్తింప సంసిద్ధులు.

అమ:- మేలు! బలదేవా! మేలు! నీరాజభక్తి యనన్యము. రండు భవానీదేవి నారాధింతము.

(తెరపడును)

రంగము 2

స్థలము—అజితుని మందిరము.

ప్రవేశము: అజితు రూపు మాట్లాడుకొనుచుందురు.

అజి:- సోదరా! ఎంతవిన్నను తనివితీరకున్నయది. నీ సాహసచర్య లతి భయానకములు, నీవర్ణన లతిరమ్యములు, నీయనుభవములు

శ్రోతల నాశ్చర్యచకితుల జేయగఁ బ్రంపదిసంవత్సరములలో నెంత యనుభవమును గడించితివి!

రావుః- సోదరా! విదేశయాత్రవలన నెట్టియనుభవము గడించినను స్వదేశమునకు తిరిగివచ్చునపుడు గల్గినయానందమునకు మేర లేదు.

తే. పరమపావనిమాతల్లి భరతమాత
యంకమునజేరి లాలననందునట్టి
భాగ్యశాలికి యిహమును బరమదెంత?
స్వర్గసౌఖ్యంబు నద్దాని సాటియగునె?

ఆత్మదేశనామోచ్చారణమాత్రమున పులకాంకితుఁడుగానిజడుండుండడు. స్వదేశరక్షణమున కుపకరింపని ధైర్యసాహసములు నిష్ఫలములు. యశఃకామినైయెంతవిహరించినను, నాజన్మదేశమగు నీభారతపుణ్యభూమిని, యీవీరరసపుత్రసీమను,స్వచ్ఛందనిర్మలవాయువుఁబీల్చునపుడు గల్గుసుఖము స్వర్గముకూడనీయజాలదు.

తే. రెక్కలార్చుచు, వినువీధి నిక్కియాడు
పక్కికున్నట్టి స్వేచ్ఛానుభవమునందు
లేశమును పరసేవలో లేదు నిజము
ఎట్టియున్నతపదవిలో మెట్టిపడిన.

సోదరా! పదివత్సరముల క్రిందవిహరించిన యీ పరిసర గిరిదుర్గవనసీమల విహరింప నామనము వువ్విళ్ళూరుచున్నది. చిన్ననాటివరిచయుగనినపుడెల్ల వర్ణింప నలవికాని యానందమావహిల్లుచున్నది. ఇప్పటికైనను, ముదుసలియగు పెదతండ్రిగారిసేవలోనచ్చు భాగ్య మీవరమేశ్వరు డొసంగినందులకు కృతజ్ఞుడను

అజి:- పెదతండ్రిగారు నీయాగమనవార్తవిని, తన్మయులైరి. నీలేఖ వచ్చిననాటినుండియు వారియానందమున కంతులేదు. రూపు-రూపనివలువరింపని గడియలేదు.

రూపు:- వారితో తీరికగా ప్రసంగించుట కింకను సమయము చిక్క-లేదు. వారేదో రాజకార్యనిమగ్నులైనట్లు కన్పడుచున్నారే.

అజి:- అవును. ప్రస్తుతరాజకార్యములు కొంచెము క్లిష్టముగనుండి వారి కలజడికల్గించుచున్నవి. ఈ యానందసమయమున వాని నుగ్గడించి, నీమనస్సున కారాటము గల్పింప నొల్లను. క్రమముగ నెల్ల నీవే తెలిసికొందువు. గోపాలవర్మను చూచితివిగదా?

రూపు:- చూచితిని, అతడును మిక్కిలివృద్ధుడయ్యె. సరియే. పెదతండ్రి గారితో తీరికగ ముచ్చటించుట కెప్పుడు వీలుచిక్కునో!

అజి:- వారికి రాజకార్యభారముచేత తీరికయుండుటలేదుకాని- మరచితి ఆయన-ఉదయమున ప్రమదావనములో విహారమొనర్చుచుం దురు. అత్తరి మంచియుల్లాసముగ నుందురు. కావున రేపటి యుదయమున ప్రమదావనమున వారిని గలిసికొని యాంతరంగికముగ మాట్లాడు కొనవచ్చును.

రూపు:- ఓహో! అట్లనా! ఉదయ మెంతప్రొద్దువరకు వా రచ్చట నుందురు?

అజి:- అదియంతయు నీకేల? నేనునీవద్దకు ఆలీనిపంపెదను. వాడు నిన్ను ప్రమదావనమున సకాలమున ప్రవేశపెట్టగలడు.

రూపు:- నేను గోపాలవర్మను కలుసుకొనియెదనంటిని. అతడు నాకై నిరీక్షించుచుండును. కావున పోయివచ్చెదను.

అజి:- అట్లనా! ఆత డీయుదయముననే, అత్యవసరరాజకార్యముపై పురము విడిచివెళ్ళవలసివచ్చెను. నీ వెరుగవుకాబోలును.

రూపు:- నాకు తెలియదు. అట్లైన నిపుడేమిచేయుదును?

అజా:—విహార మొనర్తము. అశ్వముల నాయత్తపరుప ఆలికిదివరకే దెలిపి యుంటిని. పోదమురమ్మా.

(నిష్క్రమింతురు)

రంగము ౩.

స్థలము — ప్రమదావనము.

ప్రవేశము: ముక్తాబాయి, కమల పాటపాడుచు పూలమాలలు గ్రుచ్చుచుందురు.

కాలము — ఉదయము.

కమ:— రాధకు ఆమురళీకృష్ణుని యందంతటి ప్రేమకు కారణమేమో? వయస్సున పెద్దదయ్యు, చిన్నికృష్ణుని ప్రేమించుటకు గత మేమో ?

ముక్త:— ఆ—ఆ—అట్లనకుము రాధతుచ్ఛసుఖమునకై ముద్దుకృష్ణుని ప్రేమింపలేదు. ఆ ప్రేమ యనంతమైనది. అది యీశ్వర ప్రేరితము. రాధాకృష్ణుల సంబంధము కేవలము పారమార్థికము. రాధ యాత్మ, గోపాలకృష్ణుడు పరమాత్మ. పవిత్రమైన పరమాశయము ఆత్మానుసంధానమే కదా. అయినను ఆ దివ్య మంగళ విగ్రహమునుగాంచి ముగ్ధులుకానివారుందురా ?

సీ॥ ఘననీలమేఘంబు క్రిమ్మ క్రొమ్మెరుగునా
వసమీరు పచ్చని పటమువాని,
నిద్దంపుచెక్కుల నీటుగుల్కెడి మేటి
తాటంకద్యుతులతో దనరువాని
గగనంబునను దోచు కమలాప్తుడోయన
యురమున రత్నంబు మెరయువాని,
సుందరోన్నత లతాచూడాంకురంబన
పాళిపింఛంబుచే మలయువాని

కాళ్ళ చిరుగజ్జెములమ్రోగెడు గాజులవాని,
మోవిపిల్లనగ్రోవివాని,
మురువు లిగురొత్తు మోము పసంగురులవాని,
చల్లనై దోచు నగుమోము పిల్లవాని.

సతతము సేవింపగల భాగ్యమాగోకులమునకే దక్కెగాని, ఎందరు పరమతపోధనులా సుందరవిగ్రహుని గాంచ తహ తహలాడుచుండురో కదా!

కమ:— దేవీ! నిత్యము నీరీతి యా చిన్నికృష్ణు నారాధించుచు, నీ ప్రపంచమునే మరచుచుంటివి. యుక్తవయస్సులోనుండియు నీ వీ ప్రాపంచక సుఖంబుల సరకుగొనక వెఱ్ఱివై యుండుట తగదు సుమా!

ము క్త:— నాకు—ప్రాపంచక సుఖమా! నా దేహ మితరుల సుఖమునకై యర్పింపబడినదే. కాని నాహృదయము మాచిన్మయానందుని, యానవనీతచోరుని, యాగోపికాలోలుని, యాపరమ భాగవతుని, విడచి యుండజాలదు.

ఉ॥ కంకణరావముల్ జెలగి ఘల్లని మ్రోయగ, పైట జారగా,
కుంకుమ శోభితంబయిన కోమలిమోమున ఘర్మబిందు లి
ర్వంకల జారుచుండ సురవంద్యుని నందుని బాలు గీతలన్
గొంకక పాడుచున్నొకతె గోకులమందున వెన్న ద్రచ్చ నా
మం కెనమోవివాడు సుకుమారుడు మారుడు మారులేని బ
ల్పొంకము లింపునింపి, మగపోడుము లోడక జేసినవ్వ, నా
వంకజగంధికంది, పరువా? యను, పల్కిన కుల్కిపారు నా
బొంకులమారిలీల వినిపొంగని వెంగలి యొందునుందునే॥

ఆ తుంటరి, ఆ లీలామానుష విగ్రహుడు, గోపకన్నెల గికురించి, వారితన్మయులజేసి, ఆతన్మయతను పరమాత్మని

యానందము లక్ష్యమొనర్చిన, పరమపురుషుడాగివుంగవ్రుడే. ఆ సుకుమార గాత్రుని కన్నులారగాంచి, యా దివ్యపురుషుని చేతులార పూజించి, యాలీలావినోదుని నోరారపాడి, యానవనీతచోరుని వేణురవమును వీనులారవిని, యాసుందరమూర్తిని మనసార ప్రేమించిన యాబృందావనవాసుల భాగ్యమెట్టిదో!

కమ:- అదిగో. తిరిగి నీకావేశ ముదయించుచున్నది. తానమాడి కృష్ణ మందిరమున కేగవలసిన సమయమే తెంచినది. లెమ్మా.

ముక్త:- ఆనీలగాత్రుని తలచుకొన్నంత మాత్రమున నాయొడలు పరవశ మొందుచున్నదే-వృథా-మరచితి. నీవులోనికేగి నాయుడుపుల దెమ్ము. మనమీ జలకూటమున తానమాడుదము.

(కమల నిష్క్రమించును)

(రెండవవైపునుండి దూరమున రూపసింహుడు ప్రవేశము)

రూప:- ఏమి యౌవన సౌందర్యము. ఇది యొంత యపూర్వము. తొల్లి నేను చూచిన జ్ఞప్తిలేదు.

ముక్త:- (రూపుని చూడకయే).

ఉ॥ మల్లెలగోరు పల్లవముల మాలిని బర్హము, పూలపేరులున్
గొల్లలయుల్లముల్గొనగ కోలనులీలను కేలదాల్చి యా
కల్లరిబాలుర న్గలసి కానల వేడుకగూడి యాడు యా
యల్లరి చిన్నికృష్ణుమది నాసలు దీర భజించి వేడెదన్.

రూపు:- ఎక్కడిదీ గీతము ? ఈ స్వరము మున్నెన్నడో విన్నట్లున్నది.

(అని ముక్తవైపు తేరిజూచుచుండును)

ముక్త:- ఎవరది ? పరపురుషునివలె నున్నదే. ఇచ్చటికెట్లు రాగలిగెను? ఏమీ! ఈరూపము పూర్వపరిచితమువలె నున్నదే.

రూపు:- ఈ సుందరి యెవ్వతెయో, యేకాంతమున నున్నట్లున్నది! అటుపోరాదు. పూర్వమెన్నడో చూచినట్లున్నది.

ముక్త:- (రూపుని తేరిజూచి లేచి) ఏమి యీ యాకారము. (భయకంపితయై) రూ—పు—సిం—హుని పోలియున్నది. రూపుసింహుడు మరణించె. ఇది యాతని—భూతము—కానోవు. అయ్యో! ఏదిగతి? ఆఁ—ఆఁ—(అని కెవ్వున కేక వేసి మూర్ఛిల్లును)

రూపు:- ఈమె యెవ్వతయో! భయభ్రాంతయై పడిపోయెను. ఏమియాపద గలిగెనోకదా! (సమీపించి) నా ముక్తవలె నున్నదే. ఇక్కడికెట్లు రాగలిగెను? ముక్తా! ముక్తా!! (ఆమె ముఖముపై నీరుజల్లి సేదతీర్చుచుండును).

[ దూరమున బలవంతసింగు అజితునితో ప్రవేశము ]

అజి:- అదియే! నేను తలచినది. మోనము.

బల:- అజిత్! ఏమనుచుంటివి?

అజి:- ఆఁ—అచ్చటనా? ఏమియులేదు.

బల:- (రూపు ముక్తలవైపు జూచును)

రూపు:- (ముక్త శిరమును తనతొడపై జేర్చి ముఖముపై నీటితో తుడుచుచుండును—) ఆహా! ఈమె గళమున మాంగళ్యమున్నది. (ముక్త శిరము క్రిందనుంచి లేచి) ఈమె పరకాంత. నా ముక్త—పరకాంత—ఈమెను దాకి పాపమొనర్చితిని-అయినను ఆపదయందున్నదిగదా! దాపున చెలులున్న పిలిచివత్తును (చరచర పోవును).

బల:- ఎవరాపోవునది?

అజి:- ఎచ్చట? పురుషుడా? స్త్రీయా?

బల:- ఏమీ? నీవుచూడనే లేదా? ఆ పోవునదెవరు?

అజి:- నడక—రూపువది వలెనున్నది. ఆతడిచ్చట కేలవచ్చును? వనపాలకులేమో?

బల:- వనపాలకులా—కాదు—కొంచెము ముందు పదుపుము. (ముక్త సేదతేరును; కమల ఆత్రముగ సఖులతో ప్రవేశించును)

కమ:- (ముక్తవాలకము జూచి) చెలీ! చెలీ! ఏమిట్లుంటివి? ఏమైనది?

ముక్త:- అదేమో! ఉండవే! (కమల ఉపచారముచేయును)

బల:- ఆ పోయినది రూపుసింహాచుడా !

అజి:- అట్లనే యున్నది. కాని, అతడైయుండునా! కాదనుకొనియెద. అతడైన నంత తొందరగా పోనవసరమేమి ?

బల:- నీ విచటనే యుండుము. (చెట్లచాటునుండి ముక్త కమలను సమీపించి వారిసంభాషణ మాలించుచుండును)

కమ:- అదేమమ్మా! నేనుపోయి, యించుక సేపైనను కాలేదే. ఇంతలో నేమాయెనమ్మా!

ముక్త:- అదేమో! స్వప్నమో—నిశ్చయమో—నేను చెప్పజాలనే. ఏదోభూత మావేశించినట్లయినది.

బల:- ఆవేశించినదీ !

కమ:- భూతమా ! పట్టవగలే ?

ముక్త:- ఎవరోపట్టుకొని నట్లయినదే. ఇదియేమే? నా మొగముపై కీ నీ రెట్లువచ్చినదే? నీవు చల్లితివా?

కమ:- లేదమ్మా. నేనిప్పుడేగా వచ్చినది.

బల:- ఎవరోపట్టుకొని నట్లైనదే! సరే! (తలవంచుకొని అజితుని జేరి) మనమిక పోవుదము పద. (నిష్క్రమింతురు)

కమ:- ఏలయిట్లు తత్తరచెందెదవు! సవిస్తరముగ చెప్పవమ్మా.

ముక్త:- నీ కెవ్వరును కనబడలేదా?

కమ:- లేదమ్మా, లేదు. జరిగినదేదో చెప్పరాదా?

ముక్త:- నాకేమో భయమగుచున్నదే. ఇచ్చటనిక తాళలేను. లోనికేగుదము పద

కమ:- తానమాడవా ?

ముక్త:- ఊఁహూఁ (ఇరువురును పోదురు).

———



# రా జ్యా కాం క్ష.

## తృ తీ య ఆం క ము

### రంగము 1.

స్థలము_అజితుని మందిరము.

ప్రవేశము—అజితు.

అజి:_ అలీ! అలీ!!

అలీ:_ (ప్రవేశించి) జీ! సర్కార్! సలామాలేఖుం.

అజి:_ నీవు బయటనుండి రూపుసింగురాగనే లోనికిబంపుము.

అలీ:_ షిత్తం_సర్కార్ (పోబోవును)

అజి:_ అలీ! మే మిరువురము మాట్లాడుకొనుచుండ బలవంతసింగు వచ్చును. అతని రాక కనిపెట్టి ముందుగ హెచ్చరింపుము.

అలీ:_ షిత్తం—షిత్తం. ముందు రూప్‌సింగ్. తర్వాత బలవంత్ సింగ్. హాదీకాదు మీరుసెప్పింది సర్కార్.

అజి:_ తెలిసినదా, పోమ్ము. (అలీపోవును) అన్యాయాబీజము లంకురించినవి. ఇంద్రజాలికునివలె వెనువెంటనే మొలకలెత్తి, శాఖోపశాఖలై విజృంభించున ట్లొనర్పవలెను. ఈ పాదిక పారనా, రే

ఈపాటికి అజితసింహుఁడు డీఁగద్దెనలంకరించుట నిశ్చయము. అయ్యా యికయును కమల నామాయాజాలమునఁజిక్కి (చేతిలోని జాబు నుద్దేశించి) యీయుత్తరరాజము నాకందచ్చినది. దీనిబ్రయోగించిచూచెదగాక. రూపువచ్చు వేళయైనది. నాటకమారంభింపవలయు. అజితసింహుని సామాన్యునిగా నెంచి నీబలపడితుము. అతఁడజేయుఁడని యెఱుంగఁడు.

(తెరలో) సర్దార్ రూప్‌సింగ్ ఆరహాహై.

అజి:-(ఎదురేగి) సోదరా! రమ్ము. (రూపుప్రవేశము) నీకై యెదురుచూచుచుంటిని. ఏమిది? నీమోమేలనో విన్నఁబోయినది, కారణమేమి?

రూపు:- సోదరా! నాకిచ్చటనంతయువింతగ నున్నది. కాలుమెట్టిమార్పులనైన జేయునుగదా! తొలుదొల్త నాయాగమనమున కత్యాదరమును జూపి, హర్షపులకాంకితుఁడైన మన పెదతండ్రి, నిన్నటినుండియు, అదేలనో, మనసిచ్చి మాటాడుటలేదు. కారణమెఱుంగజాల.

అజి:- ఓహో! నీ వంత కదియాకారణము! మన పెదతండ్రికి, వయసుముదిరినకొలదియు, బుద్ధి మందగించుచున్నది. నిర్హేతుకమైన యుహాపోహలకు లోనగుచుండును. నీవు నిన్నటియుదయము ప్రమదావనమున కేతెంచితివిగదా, అచట నేమిజరిగినది?

రూపు:- ఏమిజరిగినది. అచ్చట నొక కాంత కన్పించినది.

అజి:- నీవామె నీవర కెఱుంగుదువా?

రూపు:- యెఱుంగుదు ననుకొనియెద. సర్దార్ రణసింహుని కుమార్తె ముక్తయని భావించితిని.

అజి:- నిశ్చయమే.

రూపు:- నిశ్చయమేనా? ముక్తాబాయి! నిశ్చయముగ. ముక్తయేనా? ఆమె గళమున తాళియున్నది. ఆమె వివాహితయా?

అజి:- అవును, ఆమెయే మనపెదతండ్రి ముద్దులభార్య.

రూపు:- ఆ! ఎంతవింత! ఎంతటిపొరపాటు! ఆమె పరస్త్రీ యని యెరుంగక, ఆమె భయభ్రాంతయై మూర్ఛిల్ల, నామెను సేదదేర్చ, నాయొడిలో చేర్చి, ముఖమునసీరు జల్లితిని. అంతలో నామె గళమున తాళి గాంచి, పరస్త్రీయనిభావించి, యామెచెలులబిలువ బయట కేగితిని.

అజి:- ఆమెను నీవు గుర్తింపలేదా?

రూపు:- తొలుత గుర్తించితిని, గాని, తాళి చూచిన పిమ్మట ముక్త యవివాహితగదా యామెబోలిన మరియొక వ్యక్తియై యుండ నోపునని యెంచితి. ఎంతమోసము వాటిల్లెను! మాపెద తండ్రి భార్యయని యెరుంగనైతిని. తెలిసియుండియు, నీవున న్నచటి కేలబంపితివి?

అజి:- ప్రమదావనమున, బలవంతునికై సిరీక్షింపు మంటినిగాని, ముక్తను గలియుమంటినా? అయినను, నేనుమాత్ర మెన్నడైన నామెను జూచియుంటినా? బలవంతు డామెను పంజరకీరమువలె పెంచుచుండును. ఒరులకంటబడనీయడు. నీవచటి కేగుట వినియో లేక చూచియో యుండవలెను. అతనియందలిమార్పు కదియే కారణమైయుండును.

రూపు:- ఎంతయపరాధము జరిగినది, నన్ను క్షమియింపుమని యాతని ప్రార్థింతునా?

బల:- వలదు, వలదు. ఆశారిక నపహరింపబూనిన గండుగా నిన్నాతడు భావించును. బలవంతు డిప్పుడు మునుపటి మన పెదతండ్రి గాడు. ఈవివాహమైనప్పటినుండియు, గొప్పమార్పునకు లో నయ్యెను. అతని యార్ద్రతకు, అపోహకు, మేరలేదు. నేనాతని గనిపెట్టుకొనియుండుటచే, యాతని స్వభావమును పూర్తిగ

నెరింగివర్తింపుచుంటిని. నీవో దశవర్షంబులనుండియు, నిచ్చట లేనికతన యాతనిని పూర్వమువలెనే భావింపుచుంటివి.

రూపు:- ఈ నింద తలదాల్చి, యూరకుండవలసినదనా? నా నిర్దోషిత్వమును బుజువు చేయవలదా?

అజి:- అందులకే, నేనాతని స్వభావ మెరింగినవాడనుగాన, తిరియెరింగి నీనిర్దోషిత్వమును, బుజువుచేయువరకును, నీవాతనికంట మాత్రము పడకుము. మిక్కిలిప్రమాదము సంభవించును. ఈ వయసున, ఆతని సంసారసౌఖ్యమున కంతరాయము గల్పించిన వాడవగుదువు. భ్రాతృవాత్సల్యమున, నే నొసంగిన హితవు నాలింపుము. నేనాతని యుపోహను బాపువరకును నీవాతని కంటబడకుండ వర్తింపుము.

రూపు:- సోదరా! నా సేమముగోరి నాయందలి వాత్సల్యమున హిత ముపదేశింపనే నస్వభావవర్తింతునా? పాపము! ముక్త-బలవంతుని భార్యయా-విధి వైపరీత్యము! నేనేల స్వదేశమునకు మరలిరా సంకల్పించితిని?

అజి:- ఆగు——ఏదో పదములు సవ్వడి.

(తెరలో) రాజాబహద్దర్ బలవంతసింగ్ మహ్యసుల్తాన్ వారు ఆరహాహై

అజి:- త్వరపడుము, త్వరపడుము. ఆతడు వచ్చుచున్నాడు. నీవాతని కంటబడకుము. మనల నిరువుర నిచ్చటగాంచిన, నేనాతని ప్రసన్నునిచేయుట బహుకష్టము. పొమ్ము——ఈదారిని——ఈ పరిసరముల నెచ్చటను నాగక పారిపొమ్ము. (అని రూపును పంపి వేయును. కొంచెమాగి అతడు పోయినట్లు స్థిరపరచుకొని, వికట ముగనవ్వి, ఉత్తరమును దీసి చలిపి ఎడమచేతితో బట్టుకొనును) ఓరీ! దురాత్మా! తిన్నయింటివాసములే లెక్కడబూనితివా! ఓరీ

పితృద్రోహీ! నేనుసహింపను. సహింపను. (మరల బయటచూచి బలవంతుడు సమీపించుచున్న ధ్వనినివిని, కైజారుతో చేతిపై గాయము చేసికొని) ఎంతటిద్రోహము! భ్రాతృవధకుకూడ బాల్పడుదువా? (బలవంతునిరాక చూడనట్లుగానటించి) ఎంతటి క్రౌర్యము! ఎంతటిద్రోహము! నిలువుము. నిలు. నిలు. పారి పోకుము.

బల:- అజిత్! ఏమిది? ఏమి యీ కలవరపాటు?

అజి:- ఆఁ! మీరా! ఎంతసేపైనది మీరు వచ్చి? (ఉత్తరమును చేతి గాయమును కనబడకుండ దాచుటకు ప్రియత్నించునట్లు నటించును.

బల:- అజిత్! ఆ గాయమేమి? ఆరక్తమేమి?

అజి:- ఏమియు లేదే. కొంచెమేదో గాయమైనదికాబోలును. నేను చూడనేలేదే! (ఉత్తరముదాచుటకు యత్నించును)

బల:- నీవేమో దాచుటకు ప్రియత్నించుచుంటివి. ఆకాగిత మిట్లిమ్ము. నీవు గాయపడుటకు కారణ మెరిగింపుము. నా వద్ద దాచ ప్రయ త్నింపకుము.

అజి:- ఏమియు లేదు. నేనునూ—రూపును— లేను-లేదు— నేను— ఊఁ—రూపువద్దకైజారుప్రయోగమును నేర్చుకొనుచుంటిని. అంతట—

బల:- కల్ల! నీమోముచూచిన, నీవేమో రహస్యమును దాచుటకు ప్రియత్నించుచున్నట్లు స్పష్టమగుచున్నది, నాయెదుట బొంక సాహసింతువా? నీవు దాచిన కాగితము నిట్లిమ్ము.

అజి:- (ఇష్టము లేనట్లు తలవంచి యూరకుండును)

బల:-ఇచ్చెదవా? లేదా? అజిత్! నీవుకూడ అవిధేయుడవా?

అజి:- (హాహాకరించి) తండ్రీ! అట్లెన్నడును తలంపకుము. నీమాటల నే నవిధేయుడ కాజాలను. కాని-యీబాబు—కాదు—కాదు—

యీకాగితము—నీవాశింపకుము. ఇది నీ కెంత మాత్రమును మోదమొసంగజాలదు. కాదు-నీకీజాబు-అమిక్కిలి వ్యథకు కారణమగును. (బలవంతుడు అజితుని సమీపించి జాబులాగు కొనజూచును)

అజి:- తండ్రీ! నే నీజాబును నీ కీ జాలనందులకు క్షమింపుము.

బల:- ఇచ్చెదవా? లేదా? నేను దానిని చూచియే తీరవలెను.

అజి:- అయ్యో! దైవమా! ఎట్టి యిక్కట్టు దెచ్చిపెట్టితివి. ఇచ్చిన భ్రాతృద్రోహము—ఈకున్న పితృద్రోహము, ఏదియో యొకటి తప్పదు.

బల:- (జాబు లాగుకొని చదువుకొనును. ముఖమున రోషావేశము లుదయించును)

అజి:- తండ్రీ! నన్ను మన్నింపుము.

బల: నీవుకూడ యీకుట్రయం దుంటివా? నీకీజా బెట్లువచ్చినది? అనృత మాడిన, యాభవానీదేవిపాదములకు దప్పినవాడవగుదువు.

అజి:- ఇక తప్పదు. తండ్రీ క్షమింపుము. ఈజాబును ముక్తాదేవికి పంప నుద్యుక్తుడగు—రూపును—వారించితిని. కాని యా ముష్కరుడు నన్నే ధిక్కరించె. సోదరవాత్సల్యమున, మందలించియు, బెదరించియు, దూషించియు, యిట్టి పాపకృత్యమునుండి మరలింపప్రయత్నింప, యొడలుదెలియక, మత్తిల్లిన తెరంగున, నాపయి కలియబడెను. ఆసంఘర్షణలో నీజాబు నేనులాగుకొంటిని. వాడు నన్ను గాయపరచి, మీరాకగని కాబోలును, పలాయితుడయ్యె. నేనులాగుకొనుటలో నీజాబు చినిగినది. రూపుని బాల్య చాపల్యమును మన్నింప ప్రార్థన.

బల:- ఈదుర్నీతిపరునిది బాల్యచాపల్యమా? ప్రౌఢకార్యముననే సమకట్టెనే. ఓరీ! తులువా! పశుపక్ష్యాదులయందుకూడలేని యీ

దుష్ప్రవర్తన నీవు విదేశయాత్రికులతో నేర్చుకొంటివా? (ఉత్తరమును చదువుచు) "ప్రేయసీ! ముక్తా!" ఓరీ! ఛండాలా! నీ మాతృసమాన నీకు ప్రేయసియా? "ఆసెలయేటి తుంపురలలో నీవికసితము ఖపద్మము" ఏమి యీవర్ణన! ఎంతటి లజ్జావిహీనత! "మనస్వేచ్ఛావిహారముల కంతరాయము లేకుండ" ఓసీ! దుర్మార్గురాలా! నీ వలన నే నెంత మోసపోతినే. ఏమి వినయము! ఏమి భక్తి! ఏమి తన్మయత! సరి. తెలిసినది. నీ మురళీకృష్ణు డెవడో బోధపడినది. నీ జపతపంబు లెవరికొరకో తేటతెల్లమైనది. నేటితో నీవీ భూమిపై నుండవు. స్వర్గభూమిని మీరిరువురును విహరింతురుగాక.

అజి:- తండ్రీ! క్షమింపుము. అంతటి దారుణకృత్యమునకు బాల్పడకుము.

బల:- నీవు మాటాడకుము. నే నీ యంతఃపుర ద్రోహమును సైపజాలను. రసపుత్రవంశమును కళంకిత మొనర్చిన యీ దుర్నీతిపరుల క్షమింపజాల. (పోవును)

అజి:- (వికటహాసముజేసి) అజితసింహా! నీవు సంకల్పసిద్ధుడవు. అగ్ని రగిలినది. చల్లారకుండ చూడవలయును. ఈముదుసలి చపలుడు స్త్రీలోలుడు. దుర్బలత్వ మావహింపకుండ జూడవలయును. ముక్త-గర్భవతియట. దీనితో బలవంతసింగు వంశమంతరింపగలదు. రూపుసింగు, రామాస్త్రముచే గూలిన మారీచునివలె, నడుగంటును. అజితసింహుడు కళ్యాణదుర్గాధ్యక్షుడు. అంతటితో తృప్తిజెందునా? ముందీయంకము పరిసమాప్తమైన,— పిమ్మట కథ యాలోచింతము.

(నిష్క్రమించుచు)

## రంగము 2

స్థలము : ముక్తాబాయి శయనాగారము.

కాలము—రాత్రి.

కమ:- అతఁడేనటమ్మా! స్వదేశమునకు తిరిగి వచ్చెనట. మృతవార్త యసత్యమట. భూతముకాదు సజీవుఁడగు రూపుసింగే వచ్చెనట

ముక్త:- (ఆశ్చర్యచకితయై) నీకెవ్వరు చెప్పిరే యీ వృత్తాంతము?

కమ:- అజితసింహుని బానిస అలీఖాన్ చెప్పెనమ్మా! గోపాలకర్త వడుగగా సత్యమేనని బలపరచె.

ముక్త:- ఎంతటిమోసము వాటిల్లెనే. అతనిఁజూచి భూతమని భ్రమసితి. భయభ్రాంతనై మూర్ఛిల్లితిని. స్మృతికలుగు నప్పటికాతఁ డదృశ్యుండయ్యెను. నే నెంత నిర్భాగ్యురాలనైతినే. కమలా! మరి యిప్పుడు కర్తవ్యము.

కమ:- కర్తవ్యమున కేమున్నది. ఆసంగతి మరచిపొమ్ము. అతఁడచ్చటికి వచ్చిన సంగతి యెవరు నెఱుంగరుగదా! మనమేల రట్టుచేయవలెను.

ముక్త:- కమలా! నా కేమో భయమగుచున్నది. మా చిన్ననాటి పరిణయగాథ మీ యయ్య వారెఱుంగరు. నే నీయువను వివాహమాడినది రూపుసింగెఱుంగఁడు. ఇప్పుడాతఁడు సజీవుఁడై తిరిగి వచ్చెను. ఎట్టి విపరీతము లుద్భవిల్లునోయని, నామన మారాటపడుచున్నదే.

కమ:- నీవు వట్టిదేలవు. నిష్కారణముగా భయపడుదువు. నా కిందు భయకారణ మగుపడదు.

ముక్త:- నీ వెఱుంగవు కాబోలును, నేను రూపునిదప్ప యన్యుల వివాహమాడనని బాసయిచ్చితిని. కాని యాతని మరణవార్తయు, బలవంతుని బలవంతపు పెండ్లియు, తలవనితలంపుగ సంఘటిల్లినవి.

కమ:- ఇందు నీతప్పేమున్నది? ఆతడు మరణించెనని తెలియుటచేతను, నీతలిదండ్రుల నీ బలవంతము నిర్బంధమునుండి తొలగించుటకును, నీ వీ బలవంతపు పెండ్లి కొడబడితివి. ఈ విషయమెరింగినచో నుదారుడగు రూపసింగు సర్వథా తలంపడు.

ముక్త:- ఆతడుదారుడే_కాని_

కమ:- ఏమి? కాని___యని యూరకుంటివి?

ముక్త:- మహావిపత్తు నన్నావహింప నున్నట్లు నామనస్సు రాట బడు చున్నది. కమలా! నేను దిక్కుమాలినదాని నైతినే. నాజీవితము దుర్భరము. ఇంతకంటె నీయసువుల బాసిన శాంతిలభించు నేమో. ఏదోవిధముగ, గతమును మరచి, యా బృందావన నాథు నారాధింపుచు, నిర్మలజీవితమును గడుపుచుంటిని. నాకీ విషమపరీక్ష యేల తటస్థింపవలెనే?

కమ:- చెలీ! నీవూరక లేనికారణముల గల్పించుకొని నీహృదయమును కలవరపెట్టుకొను చుంటివి. నీయిష్టదైవమగు నా నవనీతచోరుని భజించి హృదయమును పదిలపరచుకొనుము. బలవంతసింగు వచ్చు సమయమైనది. జాగరూకతతో మెలంగుము. నేను నిలువదగదు.

ముక్త:- అన్నిటికి నా ద్వారకానాథుడే గలడు. నీవు పొమ్మా. నా దుర్గతి కెవరేమి చేయగలరు? (కమల పోవును. ముక్త కృష్ణ విగ్రహమునకు పూలమాల సమర్పించి, దీపారాధన మొనర్చి, చిరుతలగైకొని కృష్ణునిగూర్చి పాడుచు తన్మయతలో నుండును)

[ ప్రవేశము - బలవంతుడు ]

బల:- (ముక్తను పరికించి) ముక్తా! ముక్తా!

ముక్త:- (అదరిపడి, చూచి వంగి పుష్పముల నాతని పాదములపైనిడి, నమస్కరించును)

బల:– ఇంతకాలమునుండి పూజించుచున్నను నీయిష్టదేవత కను గ్రహము కలుగలేదా? నీవాంఛితార్థము నొసగలేదా?

ముక్తః– నాకు వాంఛితము లున్నగదా యొసంగుటకు, సర్వమును మీరు సమకూర్చుచుండ నాకు కోరదగినదేమున్నది?

బల:– ఓహో! నీవొనర్చునది కేవలము నిష్కామకర్మ కాబోలును.

ముక్తః–మూర్ఖురాలను. నాంవి దెలియవు. నామనస్సు నా ముద్దుకృష్ణుడు హరించె. నేనాతని నారాధించుచుంటిని.

బల:– ముద్దుకృష్ణుడు నీమనోహరుడా? అయిన, నే నెవరను.

ముక్తః– మీరు నా మనోధవులు, ఈ పాంచభౌతికమైన శరీరము, మీ యధీనము. మీరు శాసింపుడు.

బల:– ముద్దుకృష్ణుడు నీ మనోహరుడు. నేను నీ మనోధవుడను–అయిన– రూపు—సింహుడేమగును?

ముక్తః– (కలవరపడి యూరకుండును)

బల:– పలుకవేమి? నీపూజలు, నీపురస్కారములు, నీగీతములు, గేయ ములు, భజనలు, వీనిజూచి మోసపోతిని. మాయావీ! నిజము చెప్పుము. నీవు రూపుసింహుని ప్రేమించితివా? లేదా?... ఊఁ– చెప్పవేమి?

ముక్తః– (కన్నీటితో భయకంపితస్వరమున) ఒకప్పుడు.

బల:– ఒకప్పుడా? ఎంత నిర్భయత! ఎంత మొండితనము– ఒకప్పుడు— ఒకప్పుడుగాదు. నిన్నను వ్రీమచావనమున ఆతని యొడిలో కులుకుచుండుటలేదా? పాతకీ! నీ మొగముచూచిన పాప మంటి యించును.

ముక్తః– నాథా! నాయపరాధము.

బల:– నీయపరాధము క్షమింపవలెనా? కల్ల, నీవు క్షమార్హురాలవుగావు. వీరరసపుత్రవంశమున రణసింహుని తనయవై పుట్టి సర్వబలో

వేతుండగు బలవంతుని జేపట్టి, పుట్టినయింటికిని, మెట్టినయింటికిని తీరని కళంకమును దెచ్చిన నీ విక జీవింపరాదు. త్వరపడుము. నీ యిష్టదైవమును ప్రార్థించుకొనుము.

ముక్త:— నాథా! ఈదీను రాలి తుదివినవిన్నైనను—

బల:— నేను వినను. పవిత్రవంశమున జన్మించియు, రజపుత్రజాతికంతకు యపఖ్యాతిని గల్పించు నీజీవిత మంతమొందవలసినదే. ఈ వార్త లోకమున వెల్లడికాకముందునీ వే యంతరించుట మేలు. త్వర పడుము.

ముక్త:— హా! కృష్ణా! ఆపదుద్ధారకా! నాకుజీవితముపై నాసలేదు. కళంకినిగా ననువుంబాయుటకే వగచుచున్నాను. నానిర్దోషిత్వము -

బల:— నిర్దోషిత్వము. ఇదిగో. ఈజాబు ఋజువుచేయగలదు. (జాబు మీదపడ వేయును)

ముక్త:— (జాబుచూడకయే) నేను దోషినని యేభావించినచో నిశ్చయముగ మీకరవాలమున కెరజేయుడు. భర్తచేతులలో మరణించుటకంటె స్త్రీకికోరదగినది లేదు. నాతోపాటు మీవంశాంకురమును గూడ నిర్మూలింపుడు, త్వరపడుడు,

బల:— వంశాంకురమా! ఈపాపిష్టివంశమింతటితో నంతరించుటయే మేలు......కాని......ఉత్తమక్షత్రియులు,...స్త్రీలను, భీరువులను వధింపరు. నాక్షాత్రధర్మము నీప్రాణములదీయవలదని కాచుచున్నది. ఓసీ! పాపీ!కులటా!నిన్ను జంపి స్త్రీహత్యాదోషమునకును, భ్రూణహత్యాదోషమునకును బాల్పడజాల. నీకొరకయ రఘుడియమాత్రమువ్యవధి నిచ్చితిని. ఈలోపున నీవీప్రపంచమున మరల నాకంటబడని తావునకుబొమ్ము. నీముఖ మీజన్మమున నా కగుపడరాదు. పొమ్ము. నేను మరలవచ్చులోపున పోవలయును. తెలిసినదా! (నిష్క్రమించును)

ముక్త:- (క్రిందపడి లేచి) నాజీవిత మెంత నిర్భాగ్యమైనది! కట్టుకొన్న భర్త కులటయని దూషించి వెడలగొట్టినను నాయసువులింకను బాయకున్నవే. హే! కృష్ణా ఆపదుద్ధారకా! ఆర్తయైన ద్రౌపదిని రక్షించిననీకు, నానిర్దోషిత్వమును నిరూపించుట భారమా? గోవర్ధనధారుడవే. కుక్షినిండ విశ్వమునుజూపితివే. ఆర్తను. దీనురాలిని, నిన్నుభరింప భారమా? కాదు. ఈనిర్భాగ్యురాలిని నీవుకూడ పతితగనే భావింపుచుంటివి. అయ్యో! దిక్కుమాలిన వారి నాదరింప దైవముకూడ దిరస్కరించునుగాబోలును. కాదు దైవదూషణకూడదు. నాపాపఫలము న న్నిట్లీడ్చుచుండ నొరుల దూషింపనేల. నా కిచ్చినయురఘుడియగడువు కావచ్చినది. నేనికతడయరాదు. కృష్ణా! ని న్ననవరతమును పూజింపుచుంటిని. న న్నికష్టదశలో నీవు విడచినను, నేనుమాత్రము నిన్నువిడువను. హే! కృపానిధీ! ఈదుర్భర కాళరాత్రి, నీయంధకారమున నీవు నాయుండనున్న, నాకేభయంబును గలుగదు. (కృష్ణ విగ్రహమును చంకనిడుకొని, మేలిముసుగు సవరించుకొని) ఓ! యంధకారమా! నీవే నా కాపురాలవు. నన్ను నీలో లీనము జేసికొమ్ము. (నిష్క్రమించును)

బలః- (ప్రవేశించి నలుగడలచూచి)

పోయినదా? ఈపిశాచి, నన్నువిడచిపోయినదా? ఎంత అమాయికవలెనటించినది. ఒరులు చొర శక్యముగాని యాప్రమదావనమును, వాడెట్లుచొరగలిగె. చొచ్చిన, అంతలోనే యింతటి విపరీతమా! ఎట్టినిర్బంధమున నుంచినను, ఎంతనీతిని బోధించినను, హద్దుమీరిన స్త్రీని-ఆవుట బహుకష్టము. (నలువైపుల చూచి) ఈగృహము శూన్యమైనది. నాజన్మము వ్యర్థమైనది. నే నిపుడు దిక్కుమాలినవాడనైతిని—ఒక వేళ—నేను—ఘోర

బడలేదుగద...ఆః—బడిలో చేర్చుట కండ్లార జూచితినే. "నా కేదో భూత మావేశించినట్లైనది" యన్న మాట చెవులారవింటినే ఇందసత్యమేమున్నది? ఆ లేఖ కేమందును. ప్రణయ లేఖ— ఎంత సిగ్గువిడచి వ్రాసినాడు? ఇంతటి యవమానమును భరింప జాల—పీడవదలినది—రూపునకు విధింపవలసిన శిక్షనుగూర్చి రేపు యోచించెదను. ఇప్పుడు నాబుద్ధి కలతవడినది

కమ:— (ఆత్రముతో ప్రవేశించి) ముక్తా! ముక్తా! (బలవంతునిజూచి) ముక్తయేది?

బల:— ముక్త! విముక్తమైనది.

కమ:— ఏమైనది? (నలుగడలజూచి) ఎచ్చటను గానరాదే. అయ్యా! ముక్తయేమైనది? త్వరగ దెల్పుడు.

బల:— మీముక్త—ఈగేహమును విడచినది—ఇక — తనదేహమును విడువవలయు.

కమ:— అయ్యా! ఏలయీనిష్ఠురోక్తులు? మాముక్తగతి దెల్పుడు మిమ్ము ప్రార్థించెదను.

బల:— మీ ముక్తను-రాష్ట్రత్యాగను జేసితిని. ఈ యంధకారమున— అదృశ్యమైనది.

కమ:— అయ్యో! ఎంతటిదారుణము! ఏ నేరమునకు?

బల:— ఏ నేరమునకా? నానోట నుచ్చరింపరాని నేరమునకు. భర్తకను మరగి, యుపభర్తను గూడినందులకు.

కమ:— అన్యాయము. సకలసద్గుణసంపన్న, పవిత్రురాలు, దైవభీతిగలది. ఆమెపై నీ దోషమారోపించుట మహాపాతకము.

బల:— నీవు ఆమెకు తీర్పుదుకర్తవా? ఏమట్లు పదరుచున్నావు. నీ వెవ్వరితో మాట్లాడుచుంటివో యెరుగుదువా?

కమ:— ఎరుగకేమి? ఎరుంగుదును. న్యాయాన్యాయవిచక్షణా శూన్యునితో, అపోహావేశాపరునితో, పాషాణహృదయునితో.

బల:- కమలా!

కమ:- ఏమి బెదరించుచుంటివి. నీకంఠచ్ఛేద్ర జేసినంత మాత్రమున నేను భయపడుదానను గాను. పరమపావనియగు నిల్లాలి గుణమును గ్రహింపనేరక, దుష్టకార్యమునకు గడంగిన నిన్నేమన్నను దోషములేదు. సత్యమెఱిగిన పిమ్మట యామె పాదములపైబడి, క్షమాభిక్ష యాచించుటకుగూడ నీకర్హతలేదు.

బల:- సత్యము! సత్యమెంత చులకనగ నున్నది. నిన్నటి యుదయమున వ్రిమదావనములో రూపుసింగు యొడిలో కులుకుచుండుట సత్యముకాదా? రూపుసింగు ప్రణయలేఖను వ్రాయుట సత్యము కాదా? ఇందసత్యమేమున్నది?

కమ:- ప్రణయలేఖా?

బల:- రూపుసింగు ప్రణయలేఖ నందించుతరి, అజితుడు మందలింప యాతనిపై కలియబడి గాయపరచెనే. ఆతను తనప్రాణములకైన యాసపడక యాలేఖను లాగుకొననే. ఇదియంతయు నసత్యమేనా?

కమ:- అజితసింహుడేనా ఆలేఖను నీకిచ్చినది?

బల:- అజితునివద్దనుండి నే నేలాగుకొంటిని. ఇంతకంటెను నిదర్శనము లేమికావలెను?

కమ:- ఓరీ! పాపీ! మాయావీ! అజితసింహా! ఎంతటిక్రూరకర్మమున నొడిగట్టితివిరా! ఎంతటి కుట్రపన్నితివిరా దుర్మతీ! కల్లబొల్లి మాటలుచెప్పి నాపై ప్రేమనటియించి, యాలేఖను నావద్దనుండి గ్రహియించి, ఎంతటి దుష్కార్యమొనర్చితివిరా?

బల:- ఏమి? ఆలేఖను నీవు అజితునకేలయొసంగితివి? మాయమాటలాడి నన్నేలమోసగించెదవు? రూపుసింగునుండి యాలేఖను కలియబడి లాగుకొనుటలో గాయబడిన అజితుని నేను స్వయముగా జూచితిని.

కమః- అయ్యో! నాకిపు డర్థమైనది. ఈకుతంత్రమునంతయుపన్నినవాడు అజితు. మీవివాహమునకుపూర్వము, చిన్నతనమున రూపసింహ ముక్తాబాయి లొండొరుల ప్రేమించిరి. అప్పటి లేఖయది. పిమ్మట రూపు మరణించెనను వార్త వినిన కొలదికాలమున కామె మమ్ముల వరిణయమైనది. ఇందులకు మీకుప్రత్యక్ష సాక్ష్య మిప్పించెద. ముందు ముక్తను కాపాడు. ఆమె నిర్దోషిత్వమును ఋజువు చేయలేకున్న మీ రామె కేశిక్షనైనను విధింపవచ్చును. ఆలసించిన మోసమగును. ముక్తను వెనుక త్వరపడుడు!

బల:- ఆలేఖను నీవేలయజితునకొసంగితివి? ఇదియంతయునాకాశ్చర్యముగ నున్నదే! ప్రమదావనము మాటయేమి?

కమః- అదియును మోసమే. రూపు సజీవుడై వచ్చుట ముక్తయెరుంగదు. మీరు ముక్తను వివాహమాడుట రూపుయెఱుంగడు. వారి ప్రణయగాధను నావలన దెలుసుకొనిన అజితసింహుడే రూపు వచ్చుటికనిపియుండవలెను. ఆకస్మికముగ ప్రత్యక్షమైన రూపును గాంచి, ముక్త, భూతమని భ్రమసి, మూర్ఛచెందెను. అంతకంటెను మరియేమియు లేదు.

బలః- అయిన ముక్త నిర్దోషియందువా? ఈకుట్రపన్నుటవలన అజితునకేమిలాభము?

కమః- ఆవిషయములన్నియు, వెనుక తర్కింపవచ్చును. గర్భవతియగు ముక్త యీయంధకారమున కడుపువగిలి చావకమునుపే, తన పరాభవమును భరింపజాలక యే నూయియో గోయియో చూచుకొనకమునుపే, యామె నుద్ధరింపుము. నిరపరాధి, నిశ్చలచిత్త, నిర్మలస్వభావయగు ముక్తను కాపాడపొమ్మా.

బలః- ఇదియంతయు మహానాటకమువలెనున్నది. ముక్తనిర్దోషియందువా? అయ్యో తొందరపడి వెడలగొట్టితినే.

కమ:- కావుననే మరందామెను వదోద్ధారకమ్ము. ఆలసింపకుము. కార్యము మించిన లాభముండదు.

శల:- ముక్తా! ముక్తా! (తొందరగా బోవుచు)

కమ:- ఓరీ! అజితసింహా! క్రూరాత్మా! నాపై కపటప్రేమనటించి లాలించి, బుజ్జగించి, అరచేత స్వర్గముఁజూపి, ఎంతమోసగింతివిరా పిశాచీ. ముక్తపై నెంతజాలినటించితివి. నరరూపరాక్షసా నిన్నేమిజేసినను పాపములేదురా.

అజి:- (ప్రవేశించి) ఏ మట్లువదరుచున్నావు? ఇదియంతయు నీ కొరకే జేయుచున్నాను. నీవు రాణివి. నేను రాజను. మన విజయమార్గమును నిష్కంటకము జేయుచుండ, నాప్రయత్నమున కంత రాయము గల్పింతువా? తొలఁగుము, దారి తొలగుము.

కమ:- నేను తొలగను. నీ వెచ్చట కేగెదవు? (అడ్డువచ్చును)

అజి:- బలవంతము ననుసరింపవలెను. నే నీచాటున నుండి, నీప్రసంగము నాలించితిని. కాని చంచలస్వభావవగు నిన్ను మన్నించెదను. నన్ను పోనిమ్ము.

కమ:- ఇంకనూ నిన్ను నమ్మెద ననుకొంటివా? నీ నెయ్యంపుపలుకుల విశ్వసించి, నాచెలిప్రాణముపైకిదెచ్చితిని. ఇపుడు నాచెలిని కాపాడబోయిన, బలవంతసింహునిప్రయత్నమున కడ్డుదగుల నుద్యమించు నిన్ను నేను పోనీను. నీ కుతంత్రములన్నియు బోధపడినవి. ఇంకను మోసగింతువా?

అజి:- తొలగెదవా? లేదా? నన్నవసరముగ ప్రేరేపింపకుము. దారి తొలగుము.

కమ:- నాప్రాణములనైన నొసఁగెదగాని, నిన్నిచ్చటనుండి కదల నియ్యను.

అజి:- అయిన నిదిగో (అని కైజారుతో పొడిచి త్వరగపోవును)

కమ:- హా! దురాత్మా! ఎంతపని జేసితివిరా. (అనికూలును) (తెరపడును)

## రంగము ౭.

స్థలము. పురబాహ్యప్రదేశము - కాలము అర్ధరాత్రి

బల:- (ప్రవేశించి) ముక్తా! ముక్తా! ఎచ్చటికేగితివే? ఇంతలోనే యీ కటికచీకటిలో నింతదూర మెట్లు రాగలిగితివే? ఇరుకను భవన పరిసరములనే యుందువని, భటులనైన పిలువకుండ వచ్చితినే, ముక్తా! ముక్తా! నేను నిన్ను విడిచి జీవించుట లేదు. బయలు వెడలుము. ముక్తా, ముక్తా యను ప్రతిధ్వనులును, కీచురాళ్ళ మొలుంగులును దప్ప నేమియు వినరావు. కమలవచించినమాట సత్యమైయుండునా? ఏనాతిలోనై నమ్మబడి యసువుల బాయలేదు గద. దూరమాలోచింపక, కేవలము పోహాపై దుష్కార్యమునకు గడంగిన నాకీశిక్ష రాదగినదే. (ముందుచూచి) అందెవ్వరో నడచి నట్లయినది. అడుగుల సవ్వడియా! (కొంచెము నడచి) ఏమియు గాన్పించుటలేదు. భ్రమయై యుండును. తిరిగి యింటికి పోదునా? ముక్తిలేని గృహమున కెట్లు పోగలను. ఇంతటి యకృత్యమొనర్చి, యేదయమున ప్రజల మొగ మెట్లు చూడగలను? ఎల్లరును నా యీ చరిత్ర చెప్పుకొందురు కాబోలును. ఈ యాలోచనలతో బడి ముక్తాన్వేషణమును మరచుచుంటిని. ముక్తా! ముక్తా! (వెనుకనుండి ఒకవ్యక్తి నల్లనిముసుగుతో ప్రవేశించి బలవంతుని మెడపట్టి నంచును).

బల:- ఎవడురా! ఈ చీకటిలో - నిలు- నిలు——(వెనుకనుండి బాకుతో పొడిచి పడద్రోయును) ఓరీ! దురాత్మా! ఈ బలవంతుని దొంగ పోటున నిర్జింతువా? ఎదుటపడి బ్రతుకనేరవురా నీచుడా! (మరియొక పోటు) హా! చచ్చితి. చ——చ్చి——తి. (ప్రాణముల విడచును) (ముసుగుతీసి-అజితు-వికటముగ నవ్వును)

అజి:- రెండైనవి-నా రాజ్యకాంక్షకు సోపానములు. ఇపుడొక యుక్తి జేసిమరియొకటి నిర్మింపవలెను. (ఎలుగెత్తి) హత్య! హత్య!

సహాయమునడుగుదు—సహాయమునడుగుదు—అర్ధరాత్రముగాన, నాకేక లెవ్వరును వినువారులేరు. అదిగో దూరమున మిణుకుమిణుకుని దీపమొండు కన్పించుచున్నది. అచట నెవ్వరైన నుందురు. హంతకుని దగుపడునాసివరకె యటుబోయి, వారిని గొనివచ్చెద. (బిగ్గరగా) ఓరి! హంతకా! ఎటు బోయెదవురా? నిన్ను పోనీయను. పట్టుకొనుడు—పొడువుడు—చంపుడు— (అనుచు నిష్క్రమించును)

(కాగడలతో నిరువురు కృషీవలులు, అజితుడు ప్రవేశింతురు)

అజి:- ఈప్రాంతమునకే, ఒకవ్యక్తిని దరుముచుండ జూచితిని. ఆతడు మూల్గుచు నేలబడియెను. నే నా హంతకునిదరుముచు ఈదెస వచ్చితిని. కాని నా కనుమరగి వాడీచిమ్మచీకటిలో యదృశ్యుడయ్యెను.

1 పురు:- వానిచే వధింపబడిన యీమందభాగ్యు డెవరో. తెలిసికొనుట యుక్తముగదా?

2 పురు:- నిజమే. అటునడువుడు. ఎవ్వరో రక్తసిక్తమై యసువులబాసి పడియుండెను. రక్తమింకను వేడిగనున్నది.

1 పురు:- అయ్యా! ఈనిర్భాగ్యుని తిరుగవేయుడు. మొగమున కరదీపిక జూపుడు.

అజి:- (పరికించి) హా! తండ్రీ! జగదేకశూరా! పరమాత్ముడు నిన్నిట్లు నిర్దాక్షిణ్యముగ, నీయంధకారమున, నొంటరిగా హత్యజేసెనో గదా! తండ్రీ! నీవెంత దిక్కుమాలినవాడవైతివి? అజితునకు దిక్కెవరు?

2 పురు:- ఈయన, బలవంతసింహుడా? ఎంతటిదారుణకృత్య మాచరింపబడినది. ఇట్టి మహానుభావులకే యిట్టిగతితప్పకున్న, నిక సామాన్యులమాట లెక్కయా. అయ్యా! అజితసింహా! మాకో

పురు:- అయ్యా! రూపుసింగే యీకార్యమునకర్హుండనుటకు సందియము లేదు. ఈ కైజారే ఋజువు చేయుచున్నది.

అజి:- భటులారా! కళ్యాణీమార్గాభిముఖులై గతించెను. రూపు హంతకుడయ్యెను. మన లశాసించువారెవ్వరు?

భటులు:- అన్నిటికిని, మాకు మీరే ప్రభువులు. శాసింపుడు, మీశాసనమును తప్పక నెరవేర్చుదుము.

అజి:- రూపు నాకు సోదరుడే కాని పితృహంతకుడు. న్యాయమునకు అప్తులేరు. ఇది నిర్దాక్షిణ్యమైనది. కావున, రూపుసింహుని, సజీవునిగగాని, విగతజీవునిగగాని, పట్టియిచ్చినవారికి, పదివేల దీనారములు బహుమానము. ఈ వార్తను వాడవాడలను ప్రచురించి అతడీ రాష్ట్రమును విడువకముందే పట్టి బంధింపవలెను. తెల్లవారుసరికి, మార్గములన్నియు గాలించవలయును తెలిసినదా?

భటులు:- చిత్తము. రాజాజ్ఞ తప్పక శిరసావహించెదము.

అజి:- ఇక ప్రభువువారి మృతకళేబరమును ఉద్గమము చేర్పుడు.

( తెరపడును )

రంగము 4

స్థలము- గోపాలవర్మయిల్లు-కాలము-రాత్రి)

(ప్రవేశము—కమల మంచముపై పరుండియుండును, ప్రక్కను గోపాలవర్మ కూర్చుండి యుండును.

గోపా:- కమలా! నిర్దోషిత్వముయుక్తి లభ్యమైనదో లేదో. బలవంతుని వెంటనంటిన—అజితు—అత్యాచారమునకు బూనియుండడు గదా?

కమ:- నాకు వానిపూనిక జూచిన భయముగుచున్నది. నన్నిట్లు గాయపరుపకున్న తప్పక ప్రతిఘటించియుండెడిదానను. బలవంతుని వెంట నంటుటలో వానియుద్దేశ మేమైయుండునో ?

గోపా:- బలవంతుడు ముక్తను కాపాడకుండ జేయుట యొకటి...వీరైనచో బలవంతుడు—ని.

కమ:- ఆఁ! ఏమనుచున్నారు? బలవంతుని హత్యజేయుటకు సమకట్టునా? అంతటి దారుణమున కొడిగట్టునా?

గోపా:- అత డంతటి పనికైనను వెనుదీయడు. నా హృదయము సంక్షోభమునుబట్టి, యేదియైన విపత్తు, సంభవించియుండునని పొడకట్టుచున్నది. పాపము! పుట్టెడాశతో స్వదేశమునకు మరలి వచ్చిన రూపునకు తీరనికళంకము తలకెక్కినది. దీని భరించి యాతఁడూరకుండ గలడా?

కమ:- అభిమానధనుడును, పరాక్రమశాలియునగు రూపు తొందరపడి యాపదలకు లోనుగాడుగద.

(వెలుపల తలుపుతట్టిన ధ్వని)

గోపా:- ఎవరో తలుపు తట్టుచున్నారు, నీవట్లే పడుకొనియుండుము. నేను పోయి చూచెద. (తల్వారు గైకొని పోవును).

(ముసుగువేసికొనిన వ్యక్తితో గోపాలవర్మ ప్రవేశము)

గోపా:- మీ రెవరు? అర్ధరాత్రమున ప్రచ్ఛన్నముగ రాగతమేమి?

వ్యక్తి:- నేను సుక్షత్రియుడను. ప్రస్తుతము విపద్దశయందున్నవాడను. వీరరసపుత్ర వంశమునకు జెంది, ఆర్యమతావలంబకులగు తమ వద్దకు శరణార్థినై వచ్చితిని.

గోపా:- మీ శత్రులెవరో? మీ విపద్దశ యెట్టిదో ముందడగవచ్చునా?

వ్యక్తి:- సుక్షత్రియవంశ సంజాతులనియు, క్షత్రియోచితముగ ప్రవర్తింతురనియు వచ్చితిని. నేను కోరునది ప్రాణరక్షణము కాదు. దానిని నేనే రక్షించుకొనగలను. లేదా యథేచ్ఛగ సమరభూమిలో త్యజింపగలను—కాని—కాని—అట్టి సాహసకార్యమునకు బూనుటకు ముందు, నాకించుక యాశ్రయము కావలెను,

నేను కళంకితుడనైనాను. నా నాళముల ప్రవహించునదియు క్షత్రియుని రక్తమే. ప్రాణభిక్ష యాచించుటలేదు. కొలది కాల మాత్రము మిచ్చిన జాలును.

గోపా:- యువకుడా! నీపలుకులు నిగోపితముగ నున్నవి. ఒక్కయజితునకు తప్ప నింకెవ్వరికైనను, అశ్రయమొసంగ నీగోపాలవర్మ సంసిద్ధుడు. తుంటరియైనను, వీరు తన విధ్యుక్తధర్మము నిర్వహించుటకు వెనుకాడడు. నీ వెవ్వరవో, నిర్భయముగ బయట పెట్టుము. అవసరమైన నా ప్రాణముల నొడ్డియైనను నీకాశ్రయ మిచ్చెదను. బయటబెట్టుము.

వర్తి:- (ముసుగు దీయును. రూపుసింగు ప్రత్యక్షము).

కమ:- ఆ—రూపుసింగే!

రూపు:-(అపవారించి) వద్దు—వద్దు—నేనిపుడు నిగూఢముగ వర్తింప వలసె. నా నామ ముచ్చరింప వలదు.

గోపా:- నీవింత ప్రచ్ఛన్నముగ రాగతమేమి?

రూపు:- అయ్యా! బాలవీరసింహు నెవ్వరో హత్యజేసిరట.

కమ:- బాలవంతుడా? హత్యయే. అనుకొన్నట్లైనది.

గోపా:- హంతకు డాదుర్మార్గు డేమైయుండును?

రూపు:- ఆ హంతకుడ—నేనే నని—అజితు నిర్ధారణజేసి నన్ను బట్టితే భటుల బంపెనట.

కమ:- ఎంతటి వైపరీత్యము! వాడే హత్య గావించియుండును. దాని నీతలద్రోసెను.

గోపా:- రూపసింహా! నీ వెంతయో పరాక్రమశాలివని భ్రమసితిని. ఈ నింద తలబాల్చి, దాగొనవచ్చితివా? ఇంతటి భీరుడవెప్పుడైతివి?

రూపు:- ఆర్యా! నేను భీరువునుగాను—కలపడి—ఏబదిమందితోనైనను పోరగలను. కాని జయాపజయంబులు దైవాధీనములు. ఒంట

రిగపోరి యొక వేళ సమరమున జచ్చితిననుకొనుడు. నాపై మోపఁ బడిన, యీరెండు నిందలను, లోకము సత్యమనియే విశ్వసించును. తలపరాని మాతృద్రోహము; హేయమైన పితృహత్య. ఈ రెండును, నే నసువుల బాసినను శాశ్వతముగ, నాయ స్మృతు మలినపరచును. కావున నా నిర్దోషిత్వమును తొలుదొల్త ప్రపంచమునకు జాటి పిదప ద్రోహిపై పగదీర్చుకొననెంచి, యిటుల మీ యాశ్రయము నభిలషించితిని. ఇందు తప్పున్న జనక తుల్యులు, నన్ను మన్నింపుడు.

గోపా:- సెహబాష్-వత్సా! మంచియోచనయే జేసితివి. నీయభిప్రాయ మెరుంగజాలక భీరువని నిందించితిని. మన్నింపుము.

కమ:- మీరీ రాత్రివేళ రాజభటుల నెట్లు వంచించి రాగలిగితిరి ?

రూపు:-నేనిచ్చటకు వచ్చి కొలది దినములు మాత్రమే యగుటచే భటు లెవ్వరును నన్ను గుర్తింపలేరు. రూపుసింహును పట్టుకొనుడని ఆజితుఁ డాజ్ఞాపించెనుగాని, భటులలో చాలమంది రూపునెరుగరు

కమ:- అట్లైన మీ నిర్దోషిత్వమును నిరూపింపుటకు ముందు, ముక్తాన్వేషణము ముఖ్యము. అందులకై మనము పూనుకొనవలెను. నా గాయము ప్రబలము గాదు. నేను త్వరలోనే స్వస్థతచెందగలను. మన మిరువురమును ముక్తను వెదకుదము.

రూపు:- మంచిది.

(తెరలో - గోపాలవర్మా! గోపాలవర్మా! అని తలుపుతట్టుదురు)

గోపా:- (రూపునిజూచి) నీవు లోనికేగుము. భద్రము. త్వరగా.

(కమల, రూపు, లోనికేగుదురు. గోపాల వర్మ పోయి తలుపుతీసి, యిరువురు రాజభటులతో ప్రవేశము)

గోపా:- ఏమి? ఇంతరాత్రివేళ వచ్చితిరి?

1 భటు:- రాజాజ్ఞ, తప్పదుగదా.

గోపా:- బలవంతసింహునకింతరాత్రివేళ పనియేమి కల్గినది?

2 భటు:- ఇంకను, ఎక్కడి బలవంతసింహుడు?

గోపా:- అదేల? అట్లనుచుంటివేల? అతని క్షేమమైనది?

1 భటు:-బలవంతసింహుడు రూపుసింహునిచే హత్యగావింపబడెను.

గోపా:- రూపు హత్య గావించెనా?

2 భటు:- ఆ! రూపుసింహేనయ్యా—బలవంతుని పొడిచిన బాకుపై రూపుని—నామాక్షరము లున్నవి.

గోపా:- ఓరీ! పితృద్రోహీ! రూపుసింహా! ఎంతటి పాతక మొనర్చితివిరా! బలవంతుని దుర్మరణ ప్రాప్తునిజేసి, యేమి బావుకొనియెదవురా దుష్టా! నీవు నాకంటబడిన, ఈ కరవాలమునకీపాటి కాహుతివైయుందువు.

1 భటు:- అయ్యా! మీకాశ్చర్య మెట్టిన. తమరు- ఉదయముననే రాజ సభకు రా ప్రార్థితులు,

గోపా:- రాజాజ్ఞ యుంటివి. రాజెవరు?

2 భటు:- శ్రీ శ్రీ అజితసింహ మహారాజులవారు.

గోపా:- మిక్కిలి యానందమైనది. ఉదయమునవచ్చి దర్శనముచేసి కొందునని వారితో చెప్పుము.

2 భటు:- రూపుసింహుని సజీవునిగగాని, విగతజీవునిగగాని, పట్టియిచ్చిన వారికి, పదివేల దీనారముల బహూకరించెదమని రాజాజ్ఞ.

గోపా:- సెహబాష్- అజితసింహుడు మిక్కిలి యుక్తిపరుడు. ఆధునిక రాజ్యతంత్రనిపుణుడు. తప్పక రూపుసింహు దొరకగలడు. మంచిది. పోయిరండు.

1, 2 భటులు:-నమస్కారము. మాకు సెలవొసంగుడు. (నిష్క్రమింతురు)

(గోపాలవర్మ తలుపుబిగించి వచ్చును.)

గోపా:-అజితా, మహారాజా! కాలవైపరీత్యము (లోనికి జూచును)

[రూపు, కమల ప్రవేశము]

రూపు:- మీ నటనానైపుణ్యత మిగుల కొనియాడ దగినది. రూపు మీయొసోటబడి యింకను బ్రతికియే యుండెనే (నవ్వును)

గోపా:- (నవ్వి) వీరి నీవిధముగ జోకొట్టి, మిమ్ములను సురక్షితముగ, నీరాష్ట్రమును దాటించు, ఉపాయ మాలోచింపవలెను. నీవును కమలయు నిచ్చట నింక తడయరాదు. లోనికి రమ్ము, ఆలోచింతము.

(నిష్క్రమింతురు.)



ఓం:



# రా జ్యా కాం క్ష



## చ తు ర్థాం క ము

### రం గ ము 1

స్థలము-అరణ్యము. ప్రవేశము మతిచలించిన ముక్త.

ముక్త:- (పరువిడుచు) ఆగుము! ఆగుము! కృష్ణా పోకుము. నీ దివ్య మంగళ విగ్రహంబును తనివిదీర జూడనిమ్ము.

ఓ మేరుసమధీర! ఓ నీలవర్ణ!
ఓ చిన్మయానంద! ఓ వేణుగాన!
హా! చిన్ని నాకృష్ణ! హా! వెన్నదొంగ!
ఎందు దాగితివినీవు? ఏల రా వీవు?
మేలమా నాతోడ, మేలుగాండ్రార!
పంతమా నాతోడ పలుక వేమార.

ఈ దుర్గమ కాంతారమున, ఈ కంటక శిలామయ ప్రదేశమున, కృష్ణా నీవు పోజాలవు. నీపాదపద్మము లీ కఠిన పాషాణముల దాకి నవసియుందును. నీ తనూలత యీ కంటకములు దాకి సోలియుం

దును. నీ చెక్కుటద్దము లీ శ్రీమూజనిత ఘర్మబిందువులచే మలినమై యుండును. నిలువుము. నిలువుము. నీ శ్రీమను బాపెద. నీ పాదము లొత్తెద. కృష్ణా! కృష్ణా! అయ్యో! ఎచ్చటను కనబడవే. మెరుపుదీవవోలె నిట్టెకన్పించి యట్టె మాయ మగుదువు. (నిర్వేదముతో)

చ. వనిగల పుష్పరాజముల, వన్యఫలాదుల, తేనెసోనలన్,
అనయము సేకరింతు, భవదాగమనార్థము, వేచియుందు, నా
తనువు తరింపజేయ మదితాపముదీర్పగ, దిక్కుమాలి యీ
వని చరియించు నావెతల వాపగ, నీ వెపు డేగుదెంతువో.

నీ సుందర విగ్రహమును జూపవా? నీ పాదపద్మములనే నమ్మితిని. నీవు కనబడకున్న నేను జీవింపజాల, ఓ నందనందనా! బృందావనమును వీడి రాజాలవా? ని న్నే గోపికయైనను బంధించెనా?

ఏ నాతి పడకింట నేకాంతమందు
నిన్ను బంధించెనో నిండుకౌగిటను,
వగవనే వారికై వగతు నీకొరకు
పరులబంధము లూడ్చి బంటనీవగుట
పరువుగామదర నీకు పరులింట బడుట
నీ వేణు రావమున కే మేళవింతు.
నీతూగు ముంగురుల నే పొంగిగాంతు
నీ నవ్వు వెన్నెలల నే సంచరింతు
నీరాక రాకగా నే నాసపడుదు
కనులపండువు సేయ కాచినేనుందు
రారా! గోకులవింద! రా ముద్దుకృష్ణ!

అదిగో! ఆసెలయేటి వెల్లువలవద్ద, ఆ లతాగుల్మముల మాటున, చిన్ని వెన్నుడు వాయల్ చెన్నమీరంగ

అరికాలు నేలపై నంటకుండగ
మెడలోని హారముల్ మెదలనీకుండ
మల్లెపూ పొదరిండ్ల మాటునన్ నిలచి,
నవ్వుపువ్వుల జేర్చి నవలెత్త జేసి,
జాజిపూగములలో సాగిపోవుచును.

నాతో దాగుడుమూతలాడు చుంటివా? ఈ సారి నేనిక పోనీయను. నీ కొంటెతనము బయల్పడినది.

కొంటెవాడవు నీవు, కోరి ప్రార్థింప
పంతమా నాతోడ పలుక వేమార!

నిలు నిలు ఇక విడువను (అని పరుగిడును)

(కమల, రూపసింహుడు, ఆటవిక వేషముల ప్రవేశము)

రూపు:— కమలా! ఎంతదూర మేగినను, ఆమెజాడ తెలియుటలేదు. ఆ తెరువరు లీ ప్రాంతమున నొకస్త్రీని జూచితిమనియు, ఆమె, కృష్ణా! కృష్ణా!! యనుచు, పరువిడుచున్నదనియు దెల్పిరిగదా!

కమ:— అవును. ఆమె తప్పక ముక్తయై యుండును. శ్రీకృష్ణనామ స్మరణమున నామె తన్మయత్వము జెందును. ఇప్పటి కామె సజీవయని యాస జనించినయది. ఇక నాదీనురాలి గలిసికొను భాగ్యమెన్నటికో?

రూపు:— కమలా! నామూలమున, నతి సుకుమారవగు నీవు పడరాని యిడుమలబడు చుంటివి. కళ్యాణపురమునకును, తద్వాసులకును నారాక, ధూమకేతువువలె, నరిష్టహేతువైనది. నిర్మలస్వభావ, సాధువర్తని, అనూర్యంపశ్యయగు ముక్త నావలన లోకాపవాదమునకు గురియై దుర్గమ వనసీమ, క్రూర మృగాది ఘోర సత్వముల నడుమ లెక్కలేని యిక్కట్టులకు లోనైనది.

కమ:- ఆర్యా! విధిబలీయము, మీరేమి చేయగలరు? ముక్త సంసారమును వీడి బృందావనమును జేరవలెనని పలువరించుచుండెడిది. యీ విధముగ ప్రాప్తించునేమో.

రూపు:- నిరాశాజనిత హృదయ దౌర్బల్యమున నా కీ యాతనావును, త్యజించి యుండవలెగదా? కమలా! ఏ దుర్ముహూర్తమున, స్వదేశమున కాలిడితినోగాని, నాటినుండియు, నిట్టి వైపరీత్యము లుద్భవిల్లెను.

కమ:- ఆర్యా! కుచ్ఛితుండును, క్రూరస్వభావుండును, స్వలాభపరాయణుండును, రాజ్యకాంక్షా జనిత దుష్టకార్యాచరణుండును, నగు అజితసింహుడే, యీ మహావిపత్తునకు కారకుండు. నిశ్చయముగ, నీ నిర్మల యశశ్చంద్రికలు, వానిని మత్సరపూరితుని గావించెను. నా యనాలోచిత కార్యము దానికి తోడైనది.

రూపు:- కమలా! మనమీ, మీమాంసలో పడి, కర్తవ్యమును మరచుచుంటిమి. ముక్తను కాపాడనినాడు నా జన్మము వ్యర్థము. కావున నడువుము.

కమ:- (కొంచెము నడచి) ఈ నికుంజమునుండి, యేదియో మధురగానము వినవచ్చుచున్నది. ఆలింపుము.

రూపు:- ఔనునుమీ !

(ముక్త పాడుచు ప్రవేశము)

ఏరూపు నీదని నే దెల్పుదునిన్ను
రూపులన్నియు నీదు రూపమందుండు
ఏపేరు నీదని నే బిల్తునిన్ను
పేరుగల్గియు లేని పెద్దవీ వగుట.
ఎవరైననా కేమి? నే గోరుచిన్ని
వెన్నదొంగగ నన్ను వేవేగ గనుము.

కృష్ణా! కృష్ణా!! రావా! ఇంతలోనే మాయమైతివా! ఆసెల యేటి నీటిలో నీ ప్రతిబింబమును జూచితినే! మబ్బులో మెఱసితివే!

కమ:- ముక్త ఎంతజీర్ణించినది. వెంటనే పోల్చుకొనలేకపోతిని.

ముక్త:- (రూపును, కమలను జూచి) ఆఁ! దొరికితివి. ఇక నిన్ను పోనీయను. అమ్మా! రాధా! నీవెంత దయార్ద్రురాలవమ్మా! స్వజాతియందు నీకుగల యభిమానము కొనియాడదగినది. నీవు బలవంతముగ, తీసికొని వచ్చితివా? లేకున్న యీ మాయకాడు నన్నూరక విసిగించుచున్నాడు. ముందు నిన్ను బహూకరించెదను. (కమల మెడలో పూలమాలవైచి, పాదములకు మ్రొక్కును. -రూపు నుద్దేశించి) ఇంతకాలమునకు దయకలిగినదా? అదియు రాధ బలవంతముపైననా? నన్నింత త్రిప్పితివి? పొరబాటు! నేనే నిన్ను వెంటనంటి తరిమితిని. నీకాయాసము గల్గించితిని. ఇవిగో యీకుసుమములు, నీపాదములపై జల్లి శ్రమను బాపెదను. రమ్మా. అయ్యో! వెనుకకుబోవుచుంటివా? ఇంకను పరీక్షయేనా? గోపాలా! కరుణింపుము.

రూపు:- కమలా! ఈమెకు పూర్తిగ చిత్తచాంచల్యము గలిగినది. మనల గుర్తింపనేరకున్నది.

కమ:- చెలీ! ముక్తా! నేను కమలను. నీ చెలిని. నేను రాధను గాను. ఇటుచూడుము. ముక్తా!

ముక్త:- ఇంకనుమోసమేనా? అవిగో, ఆ శిఖిపించెము, ఆ మురళి, ఆ కౌస్తుభము, ఆ వనమాల. ఆ నీలమేఘచ్ఛాయ, ఆకర్ణాంత నేత్రములు, నాకు సాక్షాత్కారమొసగ, రాధచే మాయమాటలాడింతువా?

రూపు:- కమలా! నీవింకను లాలించిన యీమెకీ భ్రమవీడునేమో.

కమ:- ముక్తా! ఎంతటియవస్థ వాటిల్లినదే చెలీ! ఇటుచూడు. నేను కమలను, రాధనుగాను.

ముక్తః- రాధా! నన్ను మోసగింపకుము. నేను నీయానందమున కంతరాయము గల్పింపనులే. ఈరాధారమణుని, నీనుండి వేరుచేయనులే. భయపడకుము.

అంతంబు లేనట్టి యాకారమూని,
విశ్వమంతయు తానె వింతగా నిండి
సంచరించినయట్టి సాహసుం డితడు
రాధకను సన్నలో రాజిల్లుచుండె
భాగ్యంబనగ నీదె భాగ్యంబు రాధ
భక్తియనగ నిట్టి ఫలముఁలీపలదె
సాధువర్తను జేసి సంతసంబంది
పరమహానులకైన బడయంగరాని
పరమాత్ము నవలీల బడసె నీ రాధ
రాధకంటెను భక్తురాండ్రెవరు గలరు ?.

(అని వారికి ప్రణమిల్లును)

రూపు:- కమలా! యీమెకీచాంచల్య మీవిధముగ కుదురునట్లులేదు. తన్మయత్వంబున మనల రాధాకృష్ణులనియే భావించుచున్నది. కావున యథోచితముగ ప్రవర్తించి, ఈమెకు క్రమముగ చిత్తశాంతి గలుగజేయవలెను. నీవు రాధవలనే భాషింపుము.

కమ:- ముక్తా! అహార్నిశలు, కృష్ణా! కృష్ణాయని పలువరించు, నీభక్తి పారవశ్యతకు, ముగ్ధుడై, గోపికాలోలుడు నవనీతచోరుడు, నీకు సాక్షాత్కారమొసంగె. మనమిరువురమును గలసి యాతని నారాధింతము. మనజన్మ సార్థక మొనర్చుకొందము.

ముక్త:- చూచితివా! (వికటముగనవ్వి) నిజము తెలిసినది. (కృష్ణనామ సంకీర్తనముచేయుచు నృత్యమూజేసి తన్మయతజెందును. కమల పట్టుకొని పరుండజేయును).

రూపు:- ఎట్టకేలకు ముక్తను గాంచితిమి. కాని యామె వివశమైనది. బలవంతుని యిల్లాలు, చూలాలు, సకలదాసదాసీజన పరివేష్టిత, యీయరణ్యమున, నీ శిలామయ ప్రదేశమున, ఎట్టి యిడుముల గుడువ వలసెను! కమలా! మనమిప్పుడు చేయువలసినదేమి ?

కమ:- మన మీమెనొక సురక్షిత ప్రదేశమునకుజేర్చి, అందైన జలాశయ ప్రాంతమున, నొకకుటీరము నిర్మించి, యీమె ప్రసవ సమయము వరకును వేచియుందము. పిమ్మట దైవ మేమినిర్ణయించునో చూతముగాక.

రూపు:- మంచిది. అట్లేయొనర్తము.

(తెరపడును)

రంగము 2

స్థలము—అరణ్యము—ప్రదేశము—ముగ్గురు భిల్లులు.

రాయగండడు:- జనార్దనదేవు లొచ్చాక, కడుపునిండా తాగడానికే కరువైపోయిందిరా,

జగజెట్టి:- ఓరేయి ఆయనగారు మనమీద పగసేతసెప్పనేదురా తాగు డొద్దని. మైమరపులో యేలినోరి పసులే మరిసి పోతామని సెప్పుంటాడురా.

గడానాయకుడు:- ఆయనగారు బెమ్మదేవుడుకాదంట్రా. అంచే తలా సెప్పాఁడ్రా.

రాయ:- ఓసోసి. దేవతలంతా తాగినోళ్ళేకాదంట్రా, అసలు తాగుడు సమాచారం నీకు తెలుసునంట్రా?

జగ:- సెప్పరా. ఇంటామూ సుద్దులు.

గడా:- సెప్పరా—మరి నీవు మాస్తోగ్గా సెప్తావంట.

రాయు:- ఇవండల్లా మెరిక్రిమొగోల్లా... అనాడా దేవతలూ, రాచ్చసులూ, యుద్ధాలు సేసుకొంటూ, ఒకమాటారూ, ఒకమాటోడు, ఓడిపోతూ, సావులేనిమూర్తం కోసం మాంగోచిత్తుండగా,

జెగ:- చిత్తుండగా (అని దీర్ఘం తీయును)

గడా:- సావులేనిమూర్తాలే! నా రంగా! కాకే సావునేకుంటే నా మజా సూశనూ?

జెగ:- సెప్పనీరా, సాంకేంగా, మెరిక్రి పేలాంటి పేలక.

రాయు:- అప్పుడు, పాలసంద్రాన్ని మదించడానికి, ఆరూయిారూ బయద్దేలి, ఇట్టమాట్రికి, యిాశరుణ్ణి, యేడుకోని, తరవగా, తరవగా, అయిమేటేటో పుట్టాకుంటట. కడసారి అమృర్తం— అదొచ్చిందంట. అదే టమకొన్నావు—సుధ—అది తాగితే సావునేదంట. అదే యిాకలికాలంలో "సుర" అయిందంట.

గడా:- బలే! బలే! మాస్తోగ్గా సెప్పావురా. నీ కీసుద్దులన్నీ యేలా గొచ్చాయిరా.

జెగ:- మ రాదేవత లచ్చిందించాశారుగా.

రాయు:- ఇట్టు దేవుడికి మొక్కి, సుదపోయడానికి, ఓరినైనా పంపమన్నారంట. ఆపాల్ని ఆయన మాంచి సోకైన యేసంయేసుకోని దాన్నేటంటారూ? మోగిని. మోగినై మురిపించాడంట.

గడా:- అద్దదీ! మజా. ఘల్లుఘల్లూమంటూ, గాజులుసేత్తోపోస్తూ, తల్కుబెల్కుమంటూ, టక్కుతూ తారాడుతుంటే, నారాజా, ఒళ్ళే కరిచిపోయి, తాగినాటకామాసురా, ఆరాచ్చసులు.

రాయు:- కాదురా. ఆ అమృర్తం దేవత లెత్తుకొనిపోయినారంట్రా, దానికోసం యుద్ధాలు సేసుకోని సచ్చినారంట.

గడా:- అందు సేత సేకామోసురా, మన జనార్దనమంతిరిగోరు కాగుడు లేకుండా చేసేసినోరు.

రించు హరిణసమూహంబులును, పికములకు విందుగొల్పు, వివిధ విహంగ మృదుమధురగానంబును, పరమేశ్వరుని లీలావినోదంబుల వేనోళ్ళ చాటుచున్నవి. నిర్జనమై, నిస్సారమై, నిరంజనమై యోజనంబుల పర్యంతము వ్యాపించియుండు పారశీక దేశపు యెడారుల గాంచినపిమ్మట, నా కీదృశ్యమెంత రమ్యముగనున్నది. అందుచేతనే, ఈపవిత్రభారతదేశమును బోలిన పుణ్యభూమి మరి యొండు ప్రపంచమున లేదందును. తల్లీ!

సీ. గగనచుంబితములై గర్వోన్నతింజెందు
హిమశైల సౌందర్య మింపుమీర
పతితపావనమునై పరమపూజ్యంబునై
ప్రవహించు గంగా స్రవంతి వెలయ
ప్రాక్పశ్చిమంబుల ప్రాకారములబోలు
కనుమ లిర్వంకల గ్రాలుచుండ
వింధ్యమహారావళుల్ వినువీధి వెసదన్ని
గోపురద్వంద్వమై సొంపుమీర
తే. సుందరారామసీమల శోభదనర,
శౌర్యధనులగు సాహసోదారయుతుల
పూతచరితల నిలయమీ పుణ్యభూమి
పరమపావని మాతల్లి భరతభూమి.

తల్లీ! నీచరణసేవజేసి, తరింపనుద్యమించిన నాకు, విధివైపరీత్యమున లెక్కలేని యాటంకము లుదయించెను. నాపూనిక వ్యర్థమైనందులకు వగవను. అమాయికయు, భక్తశిఖామణియు, పూతచరిత్రయునగు, ముక్తజీవితము భగ్నమైనందులకు వగచుచుంటిని. ఆతని క్షేమంబునకు నాసర్వస్వము ధారవోయ సంసిద్ధుడను. ఇప్పటికిని యామెకు స్వాస్థ్యము కుదురలేదు, కమలయామెనను

క్షణమును కనిపెట్టుకొని యున్నది. కందమూలాది వన్యఫలంబుల గొని వేగ మేగవలయును. ఓపరమేశ్వరా! దయాళూ! నీవే—

(భిల్లులు లటాలునదూకి, త్రాళ్ళతో కట్టివేయుదురు)

ఓరీ! ఎవరురా! దురాత్ములారా! ఇట్టిపని జేసితిరి?

రాయు:— మేమేరమో తర్వాత సెప్తాం. ముందు మాయేలిక పాలికి రాండి.

రూపు:— ఎవరురా! మీయేలిక? ఆతడు నన్ను బంధించి తెమ్మని యాన తిచ్చెనా?

రాయు:— మా యేలిక యీ భిల్లరాజ్జ్యాని కంతకీ పెబువు. బలదేవ మారాజులు. మిమ్మట్టుకు రమ్మని ఆరు సెప్ప నేదు.

రూపు:— అయిన నన్నేల బంధించిరి?

రాయు:— ఈ కాన్లోకొచ్చిన, కొత్తమానిసి నేరైనాసరే పట్టుకోని రమ్మని ఆరి ముదల.

రూపు:— నిరాయుధుడనైన నన్ను దొంగచాటున బంధించుట శూర ధర్మమా? నాచేతి కాయుధమిచ్చి నిర్జించికొని పొండు.

రాయు:— ఓలబయ్యో! మా కదంతా తెల్దు. మీరు మాసేత సిక్కారు. మా యేలిక కాడికి రాకతప్పదు.

రూపు:— రాకున్న—?

జెగ:— రాకుంటే గంజికాయిఁడేసుకోని మోసుకపోతాం.

రూపు:— అయిన ప్రయత్నింపుడు (భిల్లురు ప్రయత్నింతురు. రూపు తన్ని పడగొట్టును)

జెగ:— ఓరోరె, యీడు సామాన్నపు మానిసికాదురోయి. యీణ్ణి తప్పక తీసుక పోవాల్సిందే.

రాయు:— బాబయ్యో! మాతో పెనగులాడ్తే లాబమేంటంట. మా కాడాయుదా లున్నాయి. మీకు నేవు. మీరుగాని మొరటతనం సేస్తే, మరిగంటే ఆటికిపని సెప్పాల్సొస్తాది. నా మాటినోర్నీ,

ఎంత బలమున్నంటే మాత్రమేంటంట. గొతిని సడ్డ యేను గేటి సేస్తాది. నా మాటినోక్కండి, మిమాల్ని గోస్తారా-సన్-తేసింటే- మేటో సేయాలొస్తాది. మా యేలిక్కాడి కొస్తె-అంతా సెప్పుకోవచ్చు, మరి ఆరివజును, మిమాపాస్తం.

రూపు:- మీ యేలిక క్రొత్తమనుష్యుల నేలట్టుకొని రమ్మనెను?

రాయ:- యోధపుర పెబువులు అమరసింహులు వారి కాడ దాగొన్నారు.

జెగ:- ఏటిరా ఆ పేలాపన.

రాయు:- ఓరి నీ వుండాఁ! నాను మాటాడుతుంటేను. ఆయనగారి మంతిరి కూడనుండాడు. మీరాయనకాడికి రాండి అంతా తెలుస్తది.

రూపు:- (తనలో) యోధపురసామ్రాజ్యమువారి మంత్రికూడా నుండిరా, వారి ప్రవాసవిషయ మీవరకె గోపాలవర్మ వలన వినియుంటిని. వారిని జేరుటయే మంచిది. (ప్రకాశముగ) ఇక్కడకు వారెంత దవ్వున గలరు?

రాయు:- మాకోన యిక్కడికొక్క కోసు దూరముంటది. ఆ రక్కడే వుంటారు రాండి.

రూపు:- నేను తలచినంత మాత్రమున మీ మెల్లల నందరను మట్టుబెట్ట గలను కాని యోధపురాధీశుని కలిసికొన గోరుటచే మీతో రా నిచ్చగింతును.

రాయు:- ఒరేయి, యీాయన పారిపోకుండ అందరన్ని పేపులా కాపుండండి. మీకత్తులు బద్రంగా ఉంచుకోండి. మరి పదండి.

(నిష్క్రమింతురు)

## రంగము 3

స్థలము - అమరసింహుని శిబిరము.

[ ప్రవేశము: అమరసింహుడు, జనార్దనుడు, బలదేవు ]

అమ:- గురుదేవా! నిన్నటి యోధపురచారులు దెలిపిన విషయమేమి?

జనా:- వత్సా! సర్వమును మన కనుకూలముగనే యున్నది. కళ్యాణ దుర్గాధ్యక్షుడైన బలవంతసింహుని బలవన్మరణమును, అజితుని రాజ్యస్వీకరణమును మీరు వినియే యుంటిరిగదా.

అమ:- భుక్తా అజితుల కలయిక మనకంత శ్రేయోదాయకము కాదేమో.

జన:- అజితు ప్రవృత్తియు, భుక్తా ప్రవృత్తికి భిన్నముకాదు. అందు చేతనే, అజితుని యాహ్వాన మంగీకరించి, భుక్తాకళ్యాణ దుర్గ గమనాసక్తుడై యున్నట్లు, విశ్వాసను పంపిన వార్తవలన వ్యక్త మగు చున్నది.

బల:- ఆర్యా! బలవంతుని మరణమునకు కారకులెవ్వరో తెలిసినదా?

జనా:- కళ్యాణదుర్గమునుండి వచ్చిన చారు లనేక విధముల జెప్పుచుం డిరి. రూపుసింగు బలవంతుని హత్యజేసెననియు, అజితు వానిని బట్టితెచ్చి భటుల నంపెననియు, యొకటి. రెండవది, అజితసింహుడే హత్యగావించి రూపసింహునిపై నారోపించెనని. ఇందు రెండవ దానిని ప్రజలందరు సత్యముని భావింపు చుండిరట.

అమ:- అట్లైన రూపు పలాయను డగుటకు గతమేమి?

జనా:- వివరము లింకను దెలిసినగాని నిర్ణయింపలేము. కాని భుక్తా కళ్యాణ దుర్గమునకు వచ్చుట మనకు మిక్కిలి యనుకూలమని దలంచెదను.

బల:- కళ్యాణదుర్గము మాత్రము బలహీనమా? అది అత్యంత దుస్సాధ్య దుర్గములలో నొకటిగదా

అమ:- ఐన, గురుదేవుల యభిప్రాయము? కళ్యాణదుర్గమును దాకవలె ననియా?

జన:- కళ్యాణదుర్గ ముభేద్యమే——

అమ:- కర్తవ్యము?

జనా:- యోధపురమున తిరుగుబాటుకు వలయు సర్వసన్నాహములును సంసిద్ధముగానున్నవి. కాని భుక్తా యనుచరు లప్రమత్తులై పని చేయు చుండిరి. ఈ స్థితియందు, భుక్తా కళ్యాణదుర్గమున కేగినచో వారిని సన్నిధినుండి నడిపించు వారుండరు. ఇక కళ్యాణదుర్గమున, నన్ననో, అజితునియందు ప్రజల కాదరములేదు, బలవంతుని హత్యవలన ప్రజల కాతనిపై ద్వేషము హెచ్చినది. ఇచ్చట అజితు భుక్తాకు యొక్కువ బలమును సమకూర్పలేడు. కావునభుక్తా కళ్యాణదుర్గమునకు, చేరినవెంటనే దానిని ముట్టడించి, ఆ సమయముననే యోధపురమున తిరుగుబాటు లేవదీయుట మేలని తలంచెదను. అట్లైన యోధపురమునుండి భుక్తాకు సహాయము చేరజాలదు.

అమ:- ఆహా! గురుదేవు లెంతటి యుక్తి జేసిరి! ఇది యెంతయు సమంజసము.

బల:- గురుదేవులు చేసిన యోచన యుక్తి యుక్తముగ నున్నది. వెంటనే మనము, బలము సమకూర్చి, సమర సన్నాహమున నుండవలయును. నూతన పరికరములు కూడ చేరినవి. వాని ప్రయోగమున మాత్రము శిక్షణ యొసంగవలయును.

జనా:- మీరప్పుడే తొందరపడకుడు. మన ప్రయత్నములో మన ముండినచో సమయమును నేను దెలిపెద. మనసన్నాహము—

భిల్లుడు:- (తొందరగ ప్రవేశించి) జయము, జయము, గురుదేవా!

జనా:- మన సన్నాహము జయముమట—మంచిది. ఏమి వార్త!

భిల్లు:- మన రాయగండడు, జెగజెట్టి గడానాయకులు, ఒక ఆటవికుని తీసుకొచ్చి, దేవరవారికి మనవిసేయ మన్నారుండి.

జనా:- ప్రవేశపెట్టుము. ఈపురుషు డెవరై యుండునో,

జనా:- (పరికించుచుండును)

రూపు:- నిర్భాగ్యుడ నగు రూపుసింహుడనే. భరింపరాని యపనిందలకు లోనై నా నిర్దోషిత్వమును ధృవపరుచుకొనినగాని విశాల భారతమున తలయెత్తుకొని తిరుగ వెరచు రూపుసింహుడను—

జనా:- మీ స్వదేశాగమనమును గూర్చియు, బలవంతుని హత్యను గూర్చియు, మే మిదివరకే చారులవలన వినియుంటిమి. మీ రిప్పుడు ప్రయాణబడలికచేత నలసియుందురు. తొలుదొల్త కొంచెము విశ్రమింపుడు. పిదప మీ చరిత్రను సవిస్తరముగ చెప్ప వచ్చును.

రూపు:- ఆర్యా! ప్రయాణబడలిక యేమియు లేదు. నేనును, ఆకస్మిక విపద్దశచే చాంచల్య మతినైన, బలవంతుని ఇల్లాలును, ఆమె సఖియు, యీనాటికే యీ యరణ్యమున వాసమేర్పరచుకొంటిమి.

జనా:- ఆహా! ఎంతటిభాగ్యము. బలదేవా!

బల:- చిత్తముస్వామీ!

జనా:- వెంటనే వారినికూడ మన శిబిరమునకు జేర్చు యేర్పాటు గావింపుము. సావధానులమై మీగతవిషయముల విచారింతము. ఆర్యా! మా యాతిథ్యమును స్వీకరించి, మమ్ముల ధన్యుల జేయుడు. ఈ బలదేవుడు మిమ్మనుసరించును.

రూపు:- గురుదేవులకు ప్రణామములు.

జనా:- ఇష్టఫలప్రాప్తిరస్తు. (బలదేవుడు దారిచూప రూపుని నిష్క్రమణము.)

అమా:- గురుదేవా! మీ చర్యలన్నియు దురూహ్యములు. రూపుసింహుడు నిందితుడో, హంతకుడో తెలియకుండగనే వానియం దింతటి విశ్వాస ముంచుట తగునా?

జనా:- వత్సా! ఎంతజేలవు. మనకు చేరిన వార్తలబట్టి కళ్యాణపుర ప్రజలెల్లరును రూపుని నిర్దోషిగ నెంచు చుండిరనియు, ఆతని బధించు ప్రయత్నములకు రోయుచుండి రనియు, రూపుసింహునకు జేసిన ద్రోహమునకే అజితు ననహ్యించుకొను చుండి రనియు, వినలేదా? అదియునుంగాక, రూపుసింహుని యొక్క లక్షణముల గాంచినంత మాత్రమున, ఆతని నిర్మల వర్తనము స్ఫురింపలేదా? సాముద్రికశాస్త్రములో సూచించిన ధీరోధాత్త లక్షణము లన్నియు, యాతనియందు ప్రస్ఫుటముగు చుండుట లేదా?

అమ:- అట్లైన, రూపుసింహుని సన్నివేశపరచిన, యా పరమేశ్వరుడు మన యందెంతయో దయాళువు. రూపుసింహుని యద్భుత పరాక్రమమును, ధైర్యసాహసములును, కరలాఘవత్వమును, వ్యూహనిర్మాణ కౌశలమును జగద్విదితము లేగద.

జనా:- అందుచేతనే, ఆతని సహాయము మన కనన్యమైనది. ఆతనికిని మన సహాయమవసరము. ఎంతటి వీర్యవంతుడైనను, ఏకాకిగ నేమియు చేయులేడుగద. తన నిర్దోషిత్వమును నిరూపించుటకును, అజితునిపై పగతీర్చుకొనుటకును, మన సహాయమవసరము. ఈ యాధునిక పరికరముల ప్రయోగమునను, వ్యూహనిర్మాణాది తంత్రసాధన యందునను, అతడు మన సైనికులకు శిక్షణ నీయగలడు. భక్తా, అజితుల గూర్చిన యా పరమాత్మయే, అమరసింహునకే రూపసింహుని ప్రసాదించెను. ఆతనిచర్య లెంత యాశ్చర్యజనకములో చూచితివా! మనముపోయి రూపు నాదరించి, కర్తవ్య మాలోచింతము రమ్ము.

అమ:- చిత్తము. (నిష్క్రమింతురు.)



# రాజ్యకాంక్ష

## పంచమాంకము.

### రంగము 1

స్థలము — కళ్యాణదుర్గమున అజితునిమహాలు.

[ ప్రవేశము — అజితుడు — అలీఖాన్. ]

అజి:— అలీ! సర్వమును సిద్ధముగనున్నదా?

అలీ:— జీ సర్కార్. భక్తాసింగ్ మహారాజావార్కి క్షుద్రంసిద్ధం.

అజి:— వారిప్పుడే యిచటకు రాగలరు. వారికి తయారుచేయు హాలుకాహా-యంమున, వారికిచ్చు మధురసభాండమును, నేను నీకిచ్చిన— ఏమి? అటు చూచెదవు?

అలీ:— ఇనుకుంటున్నామ్. సెప్పండి సర్కార్.

అజి:— ఆపోట్లములోని మత్తుపదార్థమును కొంచెము కొంచెము కలుపుచుండుము.

అలీ:— మీరు సెప్పింది అంతా మాకి సమజ్ అయింది సర్కార్.

అజి:— మోతికి వలయు సౌకర్యముల నన్నిటిని జాగ్రత్తగ చూచుచుంటివా?

ఆలీ:- భుక్తాసింగ్ జీకీ—ఔరత్—మోతీబీబీ!—మాకీ చూచామ్ సర్కార్. అదిమంచి, మంచి మాటల్ సెప్తాది సర్కార్.

అజి:- ఏమిమాటలు చెప్పినదేమి?

ఆలీ:- మీరు వాక్కీ సాలామర్యాద్ సేసారు సెప్పింది. సర్కార్! అది బహుత్ ఖూబ్ సూరత్ హైం. అది మాంచి గానేవాలీ, ఔర్, నాచీవాలీ సర్కార్. మీదిమాట సెప్తే అది మాంచి హుషార్ సేస్తాదీ సర్కార్.

అజి:-ఈసారి ఆమె నా ప్రసంగము దెచ్చినయుక్తిగ బలికి. కథనడుపుము. ఆమె ఏమనునో గ్రహించి నాకు దెల్పుము.

ఆలీ:- అదిమీ రుమాకీ సెప్పవాలీ లేదు సర్కార్. మీదీ మాటాఅంటే మాదీ పానం యిస్తాం.

అజి:- నీవు వెంటనే పోయి భుక్తాసింగు తయారుగనున్న నిచ్చట విశ్రమింప దోడ్కొనిరమ్ము.

ఆలీ:- హి త్తం. హి త్తం. (అని సలాముచేసి పోవును.)

అజి:- మోతి మిక్కిలి యుందకత్తె. భుక్తా కేవలము విషయులోలుడు. కావున యామె చేతికీలుబొమ్మ. ఈ సందర్భమున మోతీని మోసగింప గలిగితినా—కల్యాణ దుర్గముతో బాటు, యోధపురముకూడ నా హస్తగతమగును. అజితసింహా!నీవు ప్రయత్నించిన ఫలింపక పోవునా? అదిగో భుక్తాసింగు వచ్చుచున్నాడు. (ఎదురేగును.)

[ఆలీ హుక్కాకట్టుకొని, దారి చూపుచుండును. వెనుక భుక్తా ప్రవేశము.]

అజి:- భుక్తాసింగు మహారాజా బహద్దరువారికి స్వాగతము. ఆ యాసన మధిష్ఠింపుడు. ఈ పేద దుర్గాధ్యక్షుని యాతిథ్యమున లోపము లున్న, మన్నింప, మహారాజుల వారిని వేడుకొందును.

భుక్తా:- అజితసింహా! నీయాతిథ్యమునం దేలోపములును లేవు. మా యభిప్రాయమును ముందే యెరింగి, సర్వమును సమకూర్చు

చూసితి నీదేశభక్తి యత్యద్భుతము. నీయట్టి రాజభక్తిపరాయణుని, నాకు హితునిగ సమకూర్చుట నాయదృష్టము.

అజి:— దేవరవారు ఈ కొంచెమును పెద్దజేసి ప్రశంసించుచున్నారు. అది తమ విశాలహృదయమును, తమకు నాయందుగల వాత్సల్యమును తెల్పుచున్నది. శ్రీరామచంద్రునకు, ఉడుత చేసిన యుపకారము స్వల్పమైనను ఆ భక్తవరదుడు దానినామెకు శాశ్వతముగ నుండునట్లొనర్చెను.

భుక్తా:— అజితసింహా! నాకు ముఖస్తుతి తెలియదు. చేయవలసినవసరము కూడలేదు. కాని, నాసామంతులెల్లరును నీయట్టి భక్తివిశ్వాసములు కల్గియుండువారేని, యీపాటికి రూపధపుర సామ్రాజ్యము నెంత విస్తరింపజేసియుందును.

అజి:— ప్రభువువారు సత్యము వచించిరి. ఇప్పటికిని, ఏదో విద్రోహమునకు అసురసింహుని పతనమునకు కుట్రలు పన్న ప్రయత్నించువారు లేకపోలేదు. నారాష్ట్రమున నట్టివిద్రోహులకు తావు లేకుండ జేసితిని.

భుక్తా:— కావుననే నీబోంట్లుండిన చాలునంటి. నీ యాతిథ్యమున హృదయ మత్యానంద భరితమైనది. అవును——మరచితిని-నీకు నృత్య గానముల యందాదరణ గలదా ?

అజి:— ఏదో, స్వల్పముగ నానందించగలను.

భుక్తా:— అట్లైన——ఇప్పుడే గావించెదము. మోతీకి నృత్యగానములయందసమాన ప్రజ్ఞగలది. అవి విజాతీయములైనను, అత్యంతాదరణీయములు ఆలీఖాన్ !

ఆలీ:— జీ ! సర్కార్. సలామాలేఖుం.

భుక్తా:— ఈపాటికి మోతి సిద్ధముగనుండును. నీవుపోయి యామెను దోడ్కొనిరమ్ము.

ఆలీ:- షీ త్రం. సర్కార్ (అని సలాముచేసిపోవును).

భక్తా:- మోతి గానిసయుక్త్యా అసమాన ప్రజ్ఞావంతురాలు. నృత్య గానములయందేగాక, చిత్రలేఖనాది లలితకళలగూడ నారితేరినది. నాత్మ్రగ్రాహి.

అజి:- అట్టి ప్రజ్ఞావంతురాలు గావుననే, రసజ్ఞులగు దేవరవారి మన్ననలకు పాత్రురాలైనది.

భక్తా:- అదిగో వచ్చుచున్నది. (మోతి ప్రవేశము) మోతీ!

మోతి:- ఏలినవారికి సలాములు.

భక్తా:- అజితసింగు మహారాజు దక్షాదరము చూపియున్నారు. నీ నృత్యగాన విశేషముల నాతనియొద్ద నుగ్గడించితిని. కొంచెము వినోదము గావింపుము.

(ఆలీ భక్తాకు హుక్కానిచ్చును. మధురరసము తయారుచేయును మోతీపాడుచు నాట్యముసేయును. మధ్య మధ్య అజితుని సమీపించి అభినయించుచు కనుసన్నజేయును. అజితుసాదరముగ జూచుచు నాట్యములోనే భక్తాకు మత్తుపదార్థమును కలిపిన మధురరసమిచ్చును. అతడు త్రాగుచు, హుక్కాపీల్చుచు మత్తిలుచుండును).

అజి:- ప్రభువువారు విశ్రమించినట్లున్నది. ఇక విరమింతమా ?

మోతి:- ప్రభువువారు, మీయాతిథ్యమునకలరి, మీయానందముకొరకే నాట్యమొనర్ప సెలవిడిరికదా. కావున మీరే సెలవిండు.

అజి:- నీవతిచమత్కారిణివి కావున, నీభారము నాపై వైచితివి.

మోతి:- ఈ భారమునే వహింపలేరా?

అజి:- వహించుటకేయున్నది ? మరియొక పాటపాడి అభినయింపుము.

(మోతి పాడుచు అభినయించును)

అజీ:- సెహబాష్. నీప్రజ్ఞావిశేషము లనన్యము. నిశ్చయముగ నీకు రంభాయూర్వశులు తీసికట్టు కావుననే ప్రభువువారి మన్ననలకు పాత్రురాలవైతివి.

మోతి:- ప్రభువువారిమన్ననలకేనా? రసజ్ఞులను, రసికవీరులను, గ్రహింపజాలని దేమున్నది ?

అజీ:- ప్రథమసమావేశముగదా ! నీవు లలితకళ నారితేరితివట ?

మోతి:- కళారాధకులు తరచినగద, శక్తిసామర్థ్యములు బయలుపడుట.

అజీ:- సెహబాష్! నీవు ప్రియభాషిణివికూడనా ?

మోతి:- ప్రియులకుగద, ప్రియభాషిత్వ మర్థమగుట.

అజీ:- తిరిగి నీప్రియవచనామృతపాన మెప్పటికో ?

మోతి:- పిపాసకులకు కాలనిర్ణయమా ? ఐనను సాయంకాలము-అలీని బంపుడు. తెలిపెదను.

అజీ:- మంచిది. అలీ ! ప్రభువువారు గాఢనిద్రజెందియున్నారు. నీ విచ్చటనే కనిపెట్టుకొని యుండుము.

(మోతితో నిష్క్రమించును)

అలీ:- హద్దదీ! సర్కార్ కీ, ఔరత్ కీ, బలేజోడీ.

(తెరపడును)

## రంగము 2.

స్థలము - కళ్యాణదుర్గమార్గమున అమరసింహుని శిబిరము.

ప్రవేశము - జనార్దనుడు, అమరసింహుడు,
రూపసింహుడు.

జనా:- రూపసింహా! కళ్యాణపురదుర్గపు ముట్టడికి సర్వమును సిద్ధము గదా ? ఇకమానము దుర్గ మెన్నిదినములలో చేగలము ?

రూపు:- ఇప్పటి వేగమునే ప్రయాణ మొనర్చిన, నింక మూడు దినము
లలో చేరగలము. కళ్యాణదుర్గముయొక్క ఆనుపానులు, నాకు
పూర్తిగ దెలియును. దానినవలీలగా పట్టుకొనుటకు, రహస్య
మార్గమున్నది.

అమ:- ఆ దుర్గమున శిక్షితులగు సైనికులెందరుందురో ?

రూపు:- ఐదువేల కంటె హెచ్చులేరు.

జనా:- మనబలమిప్పటికి పదిహేను వేలుకదా బలదేవా! ఇం దాశ్వికు
లెంతమంది ?

బల:- అశ్వికులు, వేయిమంది మాత్రము. మిగతయంతయు కాల్బలము.
అధునిక రణశిక్షితులందు ఆయుధ సేన మాత్రము. మిగిలిన
వారు నాటువిలుకాండ్రైనను బాహాబాహి పెనగుటలో నైపుణ్యులకై
నను దీసిపోరు.

జనా:- రూపసింహా! మనము భేదోపాయము కూడ నుపయోగింపవలె
ననుకొందును.

రూపు: దుర్గము ముట్టడించుటకు ముందు, అమరసింహులు, రూప
సింహ బలదేవ సహాయులై దుర్గము నాక్రమింతురనియు, అజితుని
శాసన మంగీకరింపని వారిని దుర్గమును వీడివచ్చిన, నాదరింతు
రనియూ, జయము తప్పదనియు, చాటబంచిన, దుర్గములోని,
అత్యంతసంఖ్యాకులు అజితుని పరిత్యజింతురనుట నిక్కువము.

అమ:- మేలు. రూపసింహా! మేలు. నీయట్టి ప్రజ్ఞావంతుని, నాకు
మిత్రునిగా నొసంగిన యాపరమేశ్వరుడు వందనీయుడు.

జనా:- ఇక సైన్యవిభాగమునుగూర్చి యోచింపవలసియున్నది.

రూపు:- కళ్యాణదుర్గమునకు జేరు యోధపురమార్గమున, మన అమరసింహ
మహారాజులు, 500ల యాశ్వికులతోడను, రెండువేల కాల్బల
ముతోడను కాచికొని యుండవలెను. ఇది యోధపురము

నుండి సహాయ్యము చేరకుండుటకును, కళ్యాణ దుర్గమునుండి యోధపురము వారలు చేరకుండుటకును, అవసరము.

జనా:- ఔను. అత్యవసరమే. తక్కిన సైన్యము ?

రూప:- తక్కిన సైన్యము, దుర్గమును ముట్టడింపవలెను. అందు దక్షిణమున బలదేవు డెదుర్కొనవలెను. ఆ వైపునుండియే దుర్గమును వీడిపోవుటకు రహస్యమార్గమున్నది. మిగతప్రాంతముల నేను సమర్థించెదను.

అమ:- మిగత 500ల యాత్రికులు యేమిచేయవలెను?

రూప:- ఈ యైదువందల యాత్రికులును, మనకొండొరులకు వార్తలనందజేయుటకును, సమరవ్యూహము సక్రమముగ నడుపుటకును తోడ్పడవలెను.

జనా:- బలదేవా! నీవు సైనికుల హెచ్చరించి పురికొల్పుము. తెల్లవారు ఝామున రెండు ఘటికల ప్రొద్దుండగా తరలవలెను. తెలిసినదా?

బల:- చిత్తము. గురుదేవా.

జనా:- విశ్వావసునకు, మన వంపిన వర్తమానము యీపాటికే చేరియుండును. యోధపురమున, భుక్తావరునుచరులును, ఉద్యోగస్థులును, వెంటనే బంధింపబడుదురు. అమరసింహ పక్షపాతులందరికి, ఆయుధములీపాటికే చేరియుండును. ఎచ్చటివారి నచ్చట తెల్లవారకమునుపే బంధింపగలరు. విశ్వావసువు అమరసింహుని పక్షమున రాజ్యస్వీకరణ మొనర్చును.

బల:- ఇచ్చట కళ్యాణదుర్గముకూడ వశమైనచో జయలక్ష్మి మనల వరించును.

రూప:- అజితు మిక్కిలి చతురుడు. భుక్తావలె క్రూరుడయ్యు, విషయలోలుడుగాడు. తనకార్యనిర్వాహణము వరకే యితరుల సహాయ మొందును గాని, వారిని పూర్తిగ విశ్వసింపడు. తన

కార్యసాధనానంతరము వారిని విడనాడుటకు కూడ జంకడు. ఆతని విషయమున కడు జాగరూకతతో మెలంగవలయును. ఆతనికి వ్యవధి నీకుండగనే పైబడవలెను. లేకున్న మన మిత్ర వర్గమునకూడ తంత్రముల బన్న సమర్థుడు.

జనా:- అమరసింహా! ఈసైన్యమున కంతకును రూపుసింహుని సేనాధిపతిగ నభిషేకింపుము. బలదేవా! ఏమందువు ?

బల:- నాకు సర్వసమ్మతము. ఈ వీరశిఖామణి శాసనము మా కవశ్య కర్తవ్యము. ఈమహాయోధుని నరసను, శత్రుసంహారణ కర్మకు గడంగుటకంటె మాకు ధన్యతరమైన కార్యమొండు లేదు.

అమ: రూపుసింహామహాశయా! ఈగురుదేవుని ఆజ్ఞానుసారము, యీ బలదేవుని యామోదమున, యీ సర్వసేనకును నిన్ను నాయకునిగా నియమించితిమి.

ఓయోధవుర వీరులారా! ఓ భిల్ల సైనికులారా! మనము కోల్పోయిన స్వాతంత్ర్యమును, రాజ్యలక్ష్మిని, తిరిగి పొందుటకు, శత్రుసంహారము తప్పని సరియైనది. అహింసయే పరమధర్మమని మన యార్యధర్మములు ఘోషించుచున్నను, వర్ణాశ్రమధర్మములు క్షత్రియులకు ధర్మసంస్థాపనార్థము, సంగ్రామమున శత్రుమారణకర్మను విధించినవి. జగద్గురుండు యీ ధర్మమునే భారతయోధుడగు విజయునకు కురుక్షేత్రమున నుపదేశించెను. కావున, ఈవిజయోత్సాహుని రూపుసింహు ననుసరించి, మీ ప్రాణములనైన నొడ్డి, వీరజనయోచితంబగు సమరంబున శత్రుల నిర్జించి, పోయిన స్వాతంత్ర్యమును, పోయిన రాజ్యమును, తిరిగి ప్రతిష్ఠింపుడు, సమర సన్నాహులుగండు. జై! భవానీ దేవికి జై! బలదేవా! "భవాని" యను యీ కరవాలమిటు దెమ్ము. (అందుకొని) రూపసింహా! (కరవాల మొసంగి) సర్వసేనానివై సమరంబుల నిర్జించి, విజయలక్ష్మిని వరింపుము.

రూపు:- మహాప్రసాదము. (ప్రణమిల్లును) ఓ యోధులారా! మహానాయకులారా! వీరరసపుత్ర వంశమున నుద్భవించిన పరమ పావనులారా! భారతవీరుల ప్రతాపము జగద్విదితము. అందు రసపుత్రవీరుల వీరవిహారముల శత్రుజన హృదయ భేదనము. వీరోచితముగ వర్తించి, మీ ప్రభువుల మర్యాదను గాపాడవలసిన భారము మీపైనున్నది. ప్రాణము లస్థిరంబులు, ఏ మహామారియో, లేక ఏ యితర వ్యాధియో జనించి క్రుళ్ళి చచ్చుటకంటె, వీరకర్మ మాచరించి, ధర్మసంస్థాపనార్థము, స్వధర్మ నిర్వాహణమునకు, మీ దేశదాస్య విమోచనకొరకు, మీ యసువుల బాసినచో మీ నామములు, స్వర్ణాక్షరముల చరిత్రలో లిఖింపబడి, మీరు, రాగలకాలమువారికి మార్గదర్శకు లయ్యెదరు. భగ్గా అజితులవంటి ద్రోహుల, కుతంత్ర పరాయణుల శిక్షించుటలో దప్పేమియు లేదు. మీరు విజయకాంక్షులు గండు. జై! భవానీదేవికి జై! (తెరలో జయఘోష)

జనా:- మేలు, రూప్‌సింహా! మేలు. నేను యోధపురమును వీడునపుడు అమరసింహుని రాజ్యమున ప్రతిష్ఠించినగాని పురము ప్రవేశింపనని భవానీదేవి పాదములకడ ప్రమాణమొనర్చితిని. కాన నాదేవి నారాధింతము.

(అందరు భవానినిగూర్చి పాడుదురు. తెరపడును.)

రంగము 3.

స్థలము - కళ్యాణదుర్గమున లీలోద్యానము.

[ ప్రవేశము—అజితు—మోతి. ]

మోతీ:- నా జనకుడు పారశీకదేశపు సర్దారు. నన్ను సర్వవిద్యాపారంగతురాలిగ జేసెను. కాని విధివశమున, నొక పారశీకవర్తకుడు

గన్ను దొంగిలితెచ్చి, యీ భుక్తాసింగున కైదుకల దీనారముల కమ్మెను. నాటినుండియు నే నీతని బానిసనై_విలాసవస్తుప్రాగ నుంటిని.

అజీ:— మోతీ! దైవమెంత నిర్దయుడు! శిరము నలంకరించవలసిన గులాబిపూవును కాలరాయుటయా! నీయట్టి సర్వాంగసుందరిని, సర్వకళాశోభితను, లావణ్యవతిని, యీ మోటు మాంసికి, యీ ముదుసలికి, భుక్తాకంట గట్టెను. దైవమింత మతిమాలిన పను లేల జేయునో. నీ వేల వాని దిరస్కరింపవైతివి?

మోతి:— దేశముకాని దేశము, భాషవిజాతీయము. సాంఘిక కట్టుబాట్లు విజాతీయములు, సన్నిహితులు లేరు. ఉట్టిదుడుకేక కన్నీటిబిందువు వైనను కార్చువారు లేరు. పులినోటి మాంసఖండము నైతిని.

అజీ:— నీచరిత్ర విన్న కొలంది, నాహృదయము కంపమొందుచున్నది. నీయట్టి దీనురాలి నుద్ధరింపని జన్మమేల? ఈ కఠినాత్మునితో నీ విట్లు వేగుచుంటివో తెలియకున్నది.

మోతి:— ఉమార్ ఖయ్యాం—సిద్ధాంతములే నా కాచరణీయములు. పానపాత్ర—విలాసగోష్ఠి—నాదుఃఖమయ జీవితమున, తన్మయత గొల్పి, నాదురవస్థను మరచుట కవియే దోడ్పడుచున్నవి. ఈ హేయప్రపంచమున, నుల్లాసముగ జీవయాత్ర గడుపుటకు మరి యొకమార్గము గానరాదు. కాలకూటాంతరము అమృతమును, ముండ్లపొదలో గులాబీని, బొగ్గుగనినుండి వజ్రమును, వాన చినుకునుండి ఆణిముత్యమును, సృష్టించిన యీ సర్వేశ్వరుడు నా దుఃఖమయ జీవితమున నాశాజ్యోతి వెలిగింపలేడా? కండ్లనీరు క్రమ్ముచున్నను, మందహాసము చిరుపెదవుల తాండవింప గలదు.

అజ:— మోతి! నీవు కళోపాసకురాలవు మాత్రమేకాదు, సాహిత్య సరస్వతివి, వేదాంతవేదినివి. నీయట్టి యపురూపవతి దీక్షను తొలగింపలేని జన్మము నిశ్చయముగ, వ్యర్థము—వ్యర్థము.

మోతి:— మీకు త్రికరణశుద్ధిగ, అట్టి సంకల్పమున్నదా?

అజ:— ఉన్నదో, లేదో, నేను వచింపనేల? ఇదిగో యీ బాకుతీసికొని, నా హృదయమును చీల్చి యెట్టెట్టి తరంగములు చెలరేగుచున్నవో పరీక్షింపుము. ఊఁ—వెనుదీయకుము.

మోతి:— అంతటి సాహసకార్యమా?

అజ:— నీకుపకరింపని జీవితమీ విధముగ నంతమైనను సంతోషమే. ఇపుడే యసువులఁగోల్పోయినచో, నీ సుందరవిగ్రహము నా మనసున చిరస్థాయిగ నిలచియుండును. ఆ వదనారవిందమును వీక్షించుచు, పరలోకములో నుండినను సుఖదాయకమే. ఆలసింపక నా జన్మమును సార్థకపరచి నా పాలి ముక్తి కాంతవుగమ్ము.

మోతి:— మీకంతటి గాఢానురాగము నాపైనున్న యెడల నస్త్రవ్రతి నోటినుండి తప్పింపుము. పిమ్మట తారాచంద్రులవలె పవిత్ర పథమున నడయాడుదము.

అజ:— నిశ్చయముగ నీకట్టి సంకల్పమే యున్న, నీవే సాధింపగలవు. నీతోడ్పాటు లేనిదే, నిన్ను బంధవిముక్తనుగ జేయుట నాకసాధ్యము.

మోతి:— నేనెట్లు తోడ్పడగలను? నాకర్థమగుట లేదు.

అజ:— అర్థమగునట్లు జెప్పుమనియెదవా? నీవు దానిని తప్పక యాచరింతునని ప్రమాణమొనర్చెదవా?

మోతి:— నా బంధవిముక్తి జేతునన్న—యాచరింపకుందునా? ఆ బాల చంద్రుని సాక్షిగ—ముమ్మాటికిని యాచరింతును.

అజి:- అట్లైన, దగ్గరగరమ్ము. మనరహస్యము మనలో నిమిడియుండవలెను. మనహృదయములు రెండును యేకమైనవికదా. ఇక తను ప్రలుమాత్రి మేకముగావలసి యున్నవి. పిమ్మట నేనే నీవు, నీవే నేను. నాసుఖదుఃఖములు నీవి, నాభాగ్యోన్నతి నీది, నా భావియంతయు నీయధీనమున నున్నది. దానిని క్రమముగనిర్వహించిన, ఫలితము నీవే యనుభవింతువు.

మోతి:- ఇంతకును, నేను చేయవలసినదేమో చెప్పలేదు.

అజి:- వినుము. సావధానవై వినుము. భర్త్రా క్రూరుడు. అత్యాశాపిశాచి, వ్యసనసేయుటకైనను, జంకడు. కాని సోమరి. విలాస ప్రియుడు. కావుననే నీయందంతటి మోహము. నీవిలాసముల జేలుచున్న రాజ్యతంత్రముల గూడ మరచిపోవును. అతనిప్రాణములు నీ యధీనమున నున్నవి.

మోతి:- అతని ప్రాణములా! ఏమి సంకల్పించుచుంటివి ?

అజి:- నీబంధవిముక్తి. నీజీవితసౌఖ్యము. నీయానందగోష్ఠి.

మోతి:- అయ్యో పడుల కంతటి దుష్కార్యమా. ఆమాట నానోట నుచ్చరింపలేను. నా కాతనియం దెంతటి యసహ్యతయున్నను, ఎంతటి నీచభావమున్నను, అంతటి కర్కశహృదయము కాజాలను. అజిత్, నన్ను క్షమింపుము. నే నీ దీనావస్థలోనే కృంగికృశించెదను.

అజి:- స్త్రీకి యిదిసహజమే. ఈ హృదయదౌర్బల్యము. సహజకోమలమైన స్త్రీ కర్కశకాజాలదు. కాని కార్యసాధనకు, కాక తప్పదు. భర్త్రా జీవించియుండ, నీవును-నేనును, దేశాంతరగతులమైనను, ఖండఖండాంతరములు కేగినను, సురక్షితముగ మనగలుగ నిరాటంకము నీయభిప్రాయము. ఎచ్చటికేగినను, బట్టితెచ్చి కొరత వేయింపగలడు. ఒకవిపత్తును దాట, మరియొక విపత్తును దెచ్చిపెట్టు

కొందువా ? ఆలోచింపుము. కాకున్నను సర్వమును విడచి, దేశాంతరగతులమై యేమనుభవింపగలము; యోచింపుము. మోహితీ! నిరాశనొందకుము. నేను చెప్పిన యుక్తి యుభయ తారకము.

మోహితి:- నీవు నాహృదయమున తుఫాను లేవదీసితివి. నేను కర్తవ్యతా విమూఢుడనై, సంక్షోభమునకు లోనైతిని.

అజి:- నీసంశయముల నివారించుటకు నేను చక్కనిమార్గ మువదే శించుచుంటిని. భుక్తా యీలోకమువనున్న మనల సుఖముగ జీవింపనీడు. భుక్తా యీప్రపంచమును పీడిన, కళ్యాణదుర్గ ముతోబాటు యోధపురముకూడ వశనగె. మోహితీ_యోధ పురచక్రవర్తిని అడినదాట్ప, పొడిననాటు. అప్పుడు ఆమె చరణ సేవకుడు. ఆమె శాశనమును మన్నించి, యామె యుశఃకాం తుల సకలదిశలను వ్యాపింపజేయుచుండెను. ఆలోచింపుము_ఉదార హృదయ సర్గాదిసిస్థుతి. నిర్భాగ్యవశమున కాలివనన్నా, దుష్టుడైన భుక్తా పాలబడి, వలిగి, నలిగి, తుదకు విధివశమున చక్రవర్తినియై శాసిం చుటయెంతటి యపూర్వసంఘటనమో యోచింపుము. రానున్న విభవమును కాలదన్నెదవా ? శాశ్వతముగ భూలోక నరక మునసుభవింతువా! కోరుకొమ్ము. నీయదృష్టము నీయరచేతను న్నది. ఈ సూజితు నిమిత్తమాత్రుడు. ఉదారస్వరముగ దెల్పుము.

మోహితి:- అజితసింహా! నీవు నన్ను నిశ్చయముగ నిర్జించితివి. ఈలోక ములో నిట్టి యాతన నిక యనుభవింపజాలను. ఈనవయౌవ నము నన్ను పీడకమునుపే నాయదృష్టమును పరీక్షించెదను. నన్నేమి నేయుమందువు ?

అజి:- నీ వేమియు జేయనక్కరలేదు. భుక్తాసింగు నిన్ను త్వరలో జే రును. సహజముగ సానప్రియుడు. ఆతనిలాలించి మైమరచి

యున్నవుడు (రహస్యముగ) నే నాలీచే నొకపొట్లమును పంపె దను. దానిని మధురరసములో కలిపి యాతని కొసంగుము. ఏమట్లు చూచుచుంటివి? వెంటనే మరణింపడులే. అది కొన్ని దినములకుగాని పనిచేయదులే.

మోతి:– సరే.

అజి:– ఏదీ! నా యీ యుపాయమున కొక బహుమానకారము.

మోతి:– విజయానంతరము. అంతలోనే తొందరేల ?

అలీ:– (ప్రవేశించి) సర్కార్. భుక్తాసింగ్ మహారాజాబహద్దర్ ఆర హైం.

మోతి:- అలీ ! హుక్కా తయారుచేయుము. మధురరసమును సిద్ధ పరుచుము.

అజి:– అలీ ! (చెవిలో నేమో చెప్పును).

అలీ:– (మోతి కొకపొట్లము నిచ్చును. ఆమె భద్రపరచును).

(భుక్తాసింగు ప్రవేశము)

మోతి:– (ఎదురేగి) ప్రభువువారింత యాలస్యము చేసితిరేల ?

భుక్తా:– ఇంతవరకును నిద్రపోవుచుంటిని. అదేలనో ఈదుర్గము చేరిన ప్పటినుండియు మాకు నిద్రహెచ్చినది.

అజి:– ఇచ్చటి వాతావరణ మతిశీతలము. అయ్యది మిగానందదా యకముగ నుండనోపును.

భుక్తా:– ఇచ్చట సర్వమును మహానందదాయకములే. ఈలీలోద్యా నము నింత సుందరముగ పెంచిన, నీసౌందర్యపిపాస నెంతయైన కొనియాడదగును. (ఆసన మలంకరించును. అలీ హుక్కా యిచ్చును).

అజి:– ప్రభువు వారికి నాయందుగల యాదరముచేతనే నాయొక్క ప్రతికార్యమును, వారి కానందదాయక మగుచున్నది.

భుక్తా:- మోతీ! మొన్నటి నీ నృత్యగానముల గూర్చి, అజిత సింహులు మిక్కిలి ప్రశంసించెను. ఈ సంధ్యాసమయమున నొకపరి నాట్య మొనర్పుము.

మోతి:- ప్రభువువారి బానిసను. వారియానందమే నా విధి. (నాట్యము చేయుచు భుక్తాకు మధురరస మొసగును).

భుక్తా:- ఆహా ! ఏమినాట్యము ! మోతి ! నీ నాట్యము అనాటికానా డతిశయించు చున్నదినుమా. స్వర్గమున యప్సరసలుకూడ, నీవద్ద కొన్ని భంగిమలు, నేర్చుకొనవలసియుండును.

అజి:- ప్రభూ! ఈ నాట్య మపూర్వము. నే నెన్నడును చూచియుండ లేదు.

భుక్తా:- ఈ మోతి నన్ను ధన్యునిచేయుచున్నది. ఈరాజకీయ వాసనల నడుమ, నాకు తన్మయత్వమును గల్పించి స్వర్గసౌఖ్య మొసంగుచున్నది. ఇచ్చటికి వచ్చినప్పటి నుండియు రాజకీయముల బొత్తిగ మరచిపోతిని. తడవయినది. రేపే యోధపుర ప్రయాణము.

అజి:- ప్రభువువా రింతలోనే తిరిగిపోదురా ? కొలది దినంబులాగి యీభృత్యుని చరితార్థుని చేయ ప్రార్థన.

భుక్తా:- యోధపుర వార్త లేమియు రాలేదు. ఈ విప్లవ దినములలో ప్రధాన నగరమును వీడి చిరకాలముండరాదు.

అజి:- తమ సర్వసేనాని వీరసింహుడు, మంత్రి విశ్వావసువును సర్వము నిర్వహింప సమర్థులు.

భుక్తా:- నిశ్చయమే. కాని, పోకతప్పదు. అలీ! (హుక్కాయిచ్చును) మోతి! (మధురరసమిచ్చును).

అజి:- ప్రభువువారు ప్రయాణసన్నాహులగుచున్నారు. కానిండు. సర్వమును సిద్ధమొనర్పమందురా ?

భుక్తా:- పలుంచిచి. మోతి ఈ రసమింత మాధుర్యముగ నున్న దేమి? ఏదీ! మరికొంచెము. (ఇచ్చును).

(భుక్తాకు మగతగ్రమ్మచుండును)

మోతి:- (అజితునిచూచి చిరునవ్వు నవ్వును).

(రాజభటుడు ఒకడు ఇరువున ప్రవేశించును)

భటు:- సర్దార్. దుర్గగోపురమునుండి చూచిన రాజభటులు, దూరమునుండి యేదియో సైన్యమువచ్చుచున్నజాడ గనిరట. ప్రభువు వారికి విన్నవింపమనిరి.

అజి:- సైన్యమా! ఎంతదూరముననున్నది ?

భటు:- కనుచూపు మేరలోనున్నదట. ధూళి రేగుచున్నదట.

అజి:- నీవు పోయి గోపాలవర్మతో సత్వరము సైన్యముల నాయుత మొనర్చి, రణసంసిద్ధులగమ్మని దెల్పుము. పొమ్ము. (భటుడు పోవును) మోతి, ప్రభువు నిద్రాగతుడయ్యెనా?

మోతి:- అట్లే తోచుచున్నది. పెద్దనిద్ర కాదుగద.

అజి:- నీవాతని గనిపెట్టి యుండుము. ఆలీ !

ఆలీ:- జీ ! సర్దార్.

అజి:- నీ వీ మోతికి తోడుగ నుండుము. ప్రభువారిని లోనికి గొనిపోయి విశ్రమింపజేయుడు. మోతి నే నీ సందడియేమో చూచివచ్చెదను.

భటు:- (ప్రవేశించి) దక్షిణమునుండి ఆకస్మికముగ మరియొకదండు మన దుర్గమును దాకినది. దేవరవారికి దెలుపమని యాజ్ఞ.

అజి:- ఆ సైన్య మెవరిదై యుండునో ?

భటు:- వారాటవికులవలె నుండిరట. బందూకులకూడ ప్రయోగించుచుండిరట.

అజి:- గోపాలవర్మ సైన్యమును సిద్ధపరచినా లేదా ? వెంటనే పోయి సర్వమాయత్తపరచమని దెల్పుము.

(భటుడుపోవును) (తెరలో ధాం అని పేలుడుశబ్దము)

భటు:- (ప్రవేశము) జయము. జయము. మహారాజా.

అజి:-ఏమివార్త?

భటు:- నేలయీనినట్లు శత్రువులు దుర్గము నలుప్రక్కలను మూగు చున్నారు. మొదటి ఫిరంగిని దుర్గముపై ప్రయోగించిరి.

అజి: గోపాలవర్మ లేడా?

భటు:- వారెచ్చటను గాన్పించుటలేదు.

అజి:- కనిపించుటలేదా ? ఏమైనాడురా ?

భటు:- గోపాలవర్మయును, మరియేనూరు యోధులును కొంత కాల్బల ముతో కోటవీడి చనిరని పుకారు.

అజి:- కోటవెలపలనే శత్రువుల దాకసంకల్పించి యుండును. ఆతని చతురమతి.

భటు:- దేవా!... ... ..... ...

అజి:- ఏమిరా సందేహించెదవు ? సత్వరము దెల్పుము.

భటు;- గోపాలవర్మ-స్సైన్యముగ-శత్రువుల జేరెనని చెప్పుకొనుచున్నారు.

అజి:- శత్రువులెవరు ?

భటు:- రూపుసింహ. అమరసింహులట.

అజి:- ఎంతమోసము ! ఓరీ ! రాజద్రోహి ! ఇందులకు ఫల మనుభ వించెదవులే. మోతి! ప్రభువును లోనికిజేర్పుము. నేను విజయు డనై తిరిగి కలుసుకొందును. (వడిగా భటునితో పోవును).

మోతి:- ఎంతలో ఎంత యనర్థము వాటిల్లినది ! అలీ ! ప్రభువును మందిరమున జేర్తము రమ్ము.

( తెరపడును )

## రంగము 4.

స్థలము - కళ్యాణదుర్గసమీప యుద్ధభూమి.

ప్రవేశము - రూపుసింహుడు, అమరసింహుడు, జనార్దనవర్మ, గోపాలవర్మ.

అమ:- గోపాలవర్మా! నీకుస్వాగతము. ధర్మరక్షణార్థమై మే మొనరించు యీ సంగ్రామమున, ధర్మపక్షపాతివగు నీవు స్వసైన్యముగ మమ్ము జేరుట ప్రశంసనీయము.

రూపు:- యోధాగ్రేసరుండును, అనుభవశాలియు, పెక్కుయుద్ధముల మొక్కవోని వీరత్వమునుజూపి, యుక్కుమీఱియున్న యీ వృద్ధయోధుని రణచాలనత్వము మన పక్షమునకు జయము కూర్పకమానదు. కురువృద్ధుం బోలిన యీగురువృద్ధు నెంత ప్రస్తుతించినను తనివితీరకున్నది.

జనా:- అమరసింహా! ఈమహాయోధుని సహాయసేనానిగ నొసర్పుము. కళ్యాణదుర్గపు,ఆనుపాను లీమహామహునకు దెలిసి నట్లొరులకు దెలియవు.

గోపా:- మీరు నాయందుంచిన విశ్వాసమునకు నేనెంతయు కృతజ్ఞుడను. అజితు భుక్తాసింగు లొనర్చిన అత్యాచారమునకు ప్రతీకార మొనర్పుటయే యీ భృత్యుని పరమలక్ష్యము. రూపుసింహ ముక్తాబాయిలకు గల్గించిన యుపకృతికి, నాతోనున్న యోధులు తీవ్రకోపానలమున ప్రతి యొనర్ప వేచియుండిరి. ఇక నాలశ్యము చేయక శత్రుసంహారమునకు గడంగుడు.

అమ:- (కైజారునిచ్చి) సహాయసేనానిగా నొసర్చితిని, విజయకాంక్షులరై విరాజిల్లుడు.

రూపు:- మహాశయా! మీరు స్వసైన్యముగ దుర్గము తూర్పు దెసను

దను. విజయసిద్ధి నొందుదురుగాక. ప్రభూ! తమరును తక్కిన యోధులును మున్నిర్ణయించిన స్థానముల జేరుకొనుడు.

(గోపాలవర్మ, అమరసింహుడు, విమల్రమణము)

జనా:- రూపుసింహా! సైన్యముల పురికొల్పి తలపడుము. నేనీ సావ్యూహమునుండి, సర్వమును దిలకింతును. (పోవును)

రూపు:- ఓ! సేనానులారా! యోధులారా!

ఉ॥ అచ్చెరువందు విక్రమము నగ్గలికన్ సమరంబులోన వే
వచ్చెడి శత్రుసైన్యముల వ్రచ్చి విహారముసల్పి, యార్చి, వి
వచ్చును బోలి ఘోరసమరావని శౌర్యముజూపి యొప్పియే
పొచ్చెములేని బల్మిగల బోలిచరింపుడు దుర్నిరీక్షులై.

శా॥ ధీరోదారులు, ధైర్యసాహస మహాధీశక్తి దుర్వారులై
క్రూరాచారుల, ధూర్త శత్రుగణ దుష్కూటంబు చెండాడిపే
వీరాలాపములం జెలంగి జగతిన్ విఖ్యాత విస్తారులై
వీరాగ్రేసరులార! శౌర్యధనులై పే పొందు స్వేచ్ఛార్థమై.

క్రూరాచారులైన దుష్టరిపుల చేతిక్రింది కూడు గుడిచి మనియుంటకంటె, శత్రుసంహార మొనర్చుట వీరోచిత ధర్మము. ఈధర్మనిర్వాహణమున నసువులుబాసినవారికి వీరస్వర్గము విధినిర్ణీతము. కాలుడెప్పుడును గాలము వైచుకొని కాచియున్నవాడు. మరణ మెప్పటికైనను దప్పనిదే. స్వధర్మరక్షణార్థము మరణించుట ధీరలక్షణము. మీ పుణ్యభూమిని మఱువకుడు. కర్మయోగులను వీరాధివీరులను గని తనయశశ్చంద్రికల దశదిశల నింపిన వీరమాత యీ భరతమాత. ఆమె చరణసేవకై యాత్మార్పణ మొనర్ప వెనుదీయకుడు.

సీ॥ దండిమగలసైన చెండి గొండాడెడి
రసపుత్రవీరుల వసజెలంగ,

దుస్సాధ్య వనసీమ దుర్గవిచ్ఛేదన
దక్షులై భిల్లులు దారిజూప,
వ్యూహాది నిర్మాణ వాహ్యాళిచతురులౌ,
దండిమరాటీల పిండుగూడ,
అంగీకరంబులౌ కరియూధములనైన
నరికట్టు మావలీలురికిపోర,
శత్రుమారణ భీషణ తంత్రమందు
దేవదానవవీరు లుత్తేజు లగుచు
నిక్కి పెనగొందు రీతిని యుక్కుమీరి
చెక్కు చెదరక జయులత్కి జేకొనుందు.

( నిష్క్రమించును )

జనా:— (ప్రవేశించి) మేలు రూపసింహా! మేలు. నీయుద్బోధ యెట్టి భీరువునైనను ధీరుని చేయగలదు. నీయట్టి పుత్రరత్నముల నింకను గనినచో భారతమాత దాస్యశృంఖలములుపీకియుండదా?

(గోపాలవర్మ, అజితసింహులు పెనంగుచు ప్రవేశము)

అజి:— ఓరీ! దుర్జాతీ! దుష్టాత్మా! రాజద్రోహీ! యెందుబోయెదవురా! మృత్యువలె సపైన్యముగ శత్రుశరణాగతుండవైన భీరువా? నీద్రోహమునకు ప్రతిక్రియ యొనర్చెదనుగాచికొమ్ము.

గోపా:— ఓరీ! నరరూపరాక్షసా! నీవునాకు ధర్మమువదేశింప బూనితివా. ముఖవ్యాఘ్రమువలె, నెయ్యంబు నటించుంచి సోదరునకు ద్రోహమొనర్చిన మహాపాతకివి. పితృహంతకుడవు. అర్ధరాత్రమున నమాత్యునసమానను, పవిత్రచరిత్రను, చూలాలిని, ముక్తాబాయిని శారదవుల పాలుచేసిన రాకాసివి. హృదయమున్నదా? ఉన్న, నది పాషాణనిర్మితమై యుండవలెను. నీ పాపము పండినది. నేటితో ముక్తినందగలవు కాచికొమ్ము.

అజి:- ముదిమిచే మతిపోయి కారులరవకుము. కాచికొమ్ము.

(పోరుచు లోనికేగుదురు. భటులు పోరాడుచు నటు నిటుపోదురు)

జనా:- (ప్రవేశించి) ముసలివాడవైనను గోపాలవర్మా! ఎంతటి కర లాఘవమున మెరసితివి!

భటు:- (ప్రవేశించి) జయము జయము మహామంత్రులవారికి.

జనా:- ఏమి వార్తలు ?

భటు:- దక్షిణమున బలదేవరాజు సైనికులు కోటకెగబ్రాకి లోన ప్రవేశించి ద్వారమును తెరచిరి. బలదేవులు స్వసైన్యముగ కోటప్రవేశించుచుంటినని దేవరవారికి మనవిజేయుమనెను.

జనా:- భళీ! బలదేవా! నీ స్వామి భక్తిపరాయణత మెచ్చదగినది. నీవు త్వరగపోయి యీవార్త రూపుసింహా, అమరసింహులు కందజేయుము. (భటుడుపోవును) సమరము భీషణరూపము దాల్చినది. శత్రుసైన్యములు దుర్గరక్షణముపై వాసవిడచి, కలియబడి బాహాబాహి పెనంగుచున్నవి.

భటు:- (ప్రవేశించి) జయము జయము మహామంత్రులవారికి. దుర్గము చాలవరకు మనవశమైనది. ఇదియంతయు గోపాలవర్మ ద్రోహముచే సంభవించెనని, క్రోధమూర్తియై అజితుడాతనితో భీకరముగ పోరుచున్నాడు.

జనా:- రూపుసింహా, అమరసింహాలు లెచ్చటనున్నారు ?

భటు:- యోధపురమునుండి కొలది యోధులు భుక్తా సహాయార్థమై వచ్చుచుండ, అమరసింహుడు వారిని దాకి మట్టుబెట్టెను. ఇక రూపుసింహుడు సమరభూమిని వీరవిహారము జేయుచు, ఎచ్చట జూచినను తానయై వెలయుచుండెను. గోపాలవర్మ సహాయార్థమై వారిరువురును తమసైన్యముల మరలించిరి. ఇపుడు సంగ్రామ మత్యంత ఘోరముగ పరిణమించెను.

జనా:- సరే! నీవుపొమ్ము. (పోవును) బలదేవుడు నగర మాక్రమించి యుండును. హతశేషులగు శత్రుసైన్యము అజితునిచుట్టును జేరి పోరాడుచుండును. ఇదియే యాతని కడపటియాన. ఈ సమయమున భుక్తాజాడయే కన్పింపదేలనో. అజితు వానిగూడ నేమైన జేసియుండడుగదా! (పక్కకొదుగును).

(రూపు, అజితు, పోరుచు ప్రవేశింతురు)

రూపు:- ఓరీ! భ్రాతృద్రోహీ! పితృహంతకా! నిలు! నిలు! భీరువువలె ప్రాణములపై నాసవీడి యెందుబోదువురా? ఈ రూపుసింహుని కరవాలము నీ రక్తమును చవిజూచినగాని తనివిజెందదు.

అజి:- ఓరీ! మాతృసంసర్గజనితమహాపాతకా! వదరుబోతా! కారు లర పకుము. కార్యమునకు గడంగుము. నీ పరాక్రమ మెట్టిదో పరీక్షించెదను.

రూపు:- ఓరీ! ఇంకను నీమత్ప్రచారము మానవా? ఇట్టి దుర్భాషల నాడు నీనాలుక వేయిచీలికలు జేసెదను. కాచికొమ్ము. (ద్వంద్వ యుద్ధము; అజితుని చేతినుండి కత్తిపడిపోవును).

రూపు:- (కత్తినందించి) నిరాయుధుని సంహరింపను. ఇప్పటికైనను నీ యకార్యములకు పశ్చాత్తాపము కలుగుటలేదా? (మరల పోరుదురు. రూపు అజితుని పొడుచును).

అజి:- హా! చచ్చితి. చచ్చితిని. (కూలును).

రూపు:- (తెల్లబోయి) సోదరా!—నీవు నాచేత కూలవలసినదని విధి ప్రేరితమా. చివరవరకును నీ పట్టుదల మానవైతివి. (చెంత కూర్చుని విచారించును).

జనా:- (ప్రవేశించి) విజయోస్తు! రూపసింహ! విజయోస్తు!

రూపు:- గురుదేవా! క్షత్రియధర్మ మెంతనిష్ఠురమైనది. పితృ, భ్రాతృ ప్రేమలగూడ పరిగణింపదు.

(జై అమరసింహునకు_జై జై రూపుసింహునకు జై
జై బలదేవ మహావీరునకు జై_(అను భటులతో అమరసింహ బల
దేవ గోపాలవర్మలు ప్రవేశము.)

బల:- మహామంత్రుల కభివాదము. అజితు పరారియైనాడు. సర్వము మన వశమైనది.

జనా:- అజితు అదుగో. రూపుచే నిర్జింపబడి మరణావస్థలోనున్నాడు.

రూపు:- సోదరా! నీ వైభవమంతయు నశించినది. నీ యాసలన్నియు అడియాస లైనవి. ఇంకను నీకు పశ్చాత్తాపము కలుగలేదా? పశ్చాత్తప్తులకు పరలోకమున సుగతులుగల్గునని పెద్దలు వచింతురు. ముందుగతియైనను జూచికొమ్మా.

అజి:- సోదరా! నేను మహాపాతకిననుట సత్యము. నీ స్వదేశాగమనమే నన్నిట్టి యకార్యములకు పురికొల్పినది. నా భావియాశయములకు నీ వంతరాయము గల్పింతువని భ్రమసితిని.

రూపు:- నీ కోరిక నాకు దెల్పియున్న నీ కొరకు సర్వమును పరిత్యజించియుందునే.

అజి:- నా కాంక్ష, నా రాజ్యకాంక్ష, నన్నంధుని జేసినది. నీకును ముక్తకును సంబంధము కల్పించి బలవంతుని ప్రాణముల బలిగొంటిని. నేను జీవింపను—వీరైన మరియొకహత్య జరుగకుండ కాపాడగలరేమో ప్రయత్నింపుడు.

రూపు:- అదేమి? మరియొక హత్యయేమి?

అజి:- భుక్తాకు వానియుంపుడుకత్తె మోతిచే విషప్రయోగము నియోగించితిని.

జనా:- భుక్తా యెచ్చట నున్నవాడు?

అజి:- దుర్గములోని లీలోద్యానమందిరమున.

జనా:- బలదేవా! రమ్ము చూతము. (ఇరువురు పోదురు)

రూపు:- భుక్తాను హత్యకావింప నవసరమేమి?

అజి:- యోధపురమునుగూడ వశపరుచుకొనవలెననెడి కాంక్ష—నా రాజ్యకాంక్షయే నా యకార్యములకు మూలము. అమరసింహా!

నీవు యౌధపురమును నిరాటంకముగ నేలుకొనుము. రూప
సింహా! ఈ దుర్గము నీది.

రూపు:- బలవంతుని యిల్లాలు శిబిరమున ప్రసవవేదనలో నున్నది.
ఆమె గర్భమున నీ దుర్గాధిపతి యుదయించునేమో!

కమ:- (శిశువుతో ప్రవేశించి) మానెచ్చెలి ముక్త యీ శిశువును నా
కర్పించి తనయసువులబాసినది. ఈ దుర్మార్గు డింకను జీవించి
యుండెనా ? ఓరీ ! మహాపాతకీ ! నన్ను వంచించి, ఈ విషా
దాంత నాటకమాడితివా ?

రూపు:- (వారించి) కమలా! ముక్తగతించినదా ? ఆమె కష్టములుగట్టె
క్కెనా ? ఈతను పుణ్యలోక ప్రయాణమునన్నవాడు. నిష్ఠు
రోక్తులాడకుము.

కమ:- ఈ పాపికి పుణ్యలోకమా? రౌరవాది మహానరకములుజాలక,
వీనికొరకు నూతన నరకమును సృష్టింపవలసియున్నది.

రూపు:- కమలా ! నామాటవినవా ?

అజి:- రూపుసింహా! నీ యౌదార్యము మెచ్చదగినది. ని న్నర్థముచేసి
కొనలేక యీ కష్టముల సమకూర్చితిని. విజయులై వర్ధిల్లుము.

(జనార్దన బలదేవులు ప్రవేశము)

జనా:- మేము పోవునప్పటికే భుక్తా యసువులబాసి యుండెను. చేయు
నదిలేక మరలివచ్చితిమి.

అజి:- భుక్తా-మరణించెనా? సోదరా యిాకత్తి నూడ బెరుకుము. ఇక
భరింపజాల.

రూపు;- (కత్తితీయును-అజితు మరణించును).

జనా:- అజితుని రాజ్యకాంక్ష విషాదాంతమైనది. యౌధపురమున
శత్రుల నిర్జించి, రాజ్యము స్వీకరించినట్లు విశ్వావసువు వార్త
నంపెను. అమరసింహా! నీవు యౌధపుర సామ్రాట్టువు. ఇకవిజ
యోత్సవమును నగరప్రవేశ మహోత్సవమునుచాటబంపుము.
బలదేవా! నీవు సర్వస్వతంత్రుడవు. అమరసింహునకు మిత్రుం
డవై చరింపుము.రూపుసింహా! నీ వీకళ్యాణదుర్గమున కధిపతివి.

రూపు:- దేవా! ఇంచుక శాంతుడవు. కమలా! ఆ శిశువునిటు దెమ్ము. (అందుకొని) బలవంతసింహుని తనయుడు, ముక్తగర్భశుక్తి ముక్తాఫలము—ఈ శిశువే కళ్యాణదుర్గాధ్యక్షుడు. కేవలము, ఆ ముక్తకనులే. రూపురేఖ లాయమవే. ముక్త నా హృదయాధిదేవత. ఆమెమూర్తి నారాధింపుచు బ్రహ్మచర్యమున నుండ దీక్ష వహించితిని. ముక్త—ఆత్మత్యాగి—పరమభక్త శిఖామణి—పరమయోగిని—ఆమె తనయుడే యీ దుర్గమును పాలింపవలయును.

జనా:- అట్లైన యీ శిశువు స్వతంత్రుడగు వఱకు నీవు రాజప్రతినిధిగను సంరక్షకునిగను వ్యవహరింపుము. (అమరసింహునితో) వత్సా యేమందువు?

అమ:- తప్పక అట్లే జరుగుగాక.

జనా:- ఇది మోక్షపుర చక్రవర్తియాజ్ఞ—రూపుసింహా!

రూపు:- తలధరించి మన్నింతును.

జనా:- ఇక దుర్గప్రవేశ మొనర్తమురండు.

(జయభేరీ మ్రోగును—తెరపడును)

మంగళం.

సంపూర్ణము.

---

## గమనిక

1 పుట 4 పంక్తి

"నా "నాగరికులమని" తరువాత— "విఱ్ఱవీగు నత్యాచారులు నా మనుష్యంచు ధర్మము" చేర్చి చదువుడు.

ఆదేపుటలో పంక్తి 8 బల; "వీరవిహారము చేయుచున్న" తరువాత

"ఈ భిల్లగణము తమ ప్రాణమొట్టున కాళ్లద కఱగినపుడు" అన్నవాక్యము చేర్చి చదువుడు.